


చందమామ సంపుటి: 60 ఏప్రిల్ 2007 సంచిక:4

## ఈ సంచికలో...



## ఈ నెల విశేషాలు











## SUBSCRIPTION

For USA and Canada
Single copy $2
Annual subscription $20

*Remittances in favour of Chandmama India Ltd.*

to


Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal,
Chennai - 600 032
E-mail :
subscription@chandamama.org




## చందా

ఎయిర్‌మెయిల్ ద్వారా అన్నిదేశాలకు పన్నెండు సంచికలు రూ: 900

ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ. 150.00

చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.


For booking space in this magazine please contact:
CHENNAI Shivaji : Ph : 044-22313637 / 22347399
Fax: 044-22312447, Mobile : 98412-77347
email : advertisements @chandamama.org
DELHI : OBEROI MEDIA SERVICES, Telefax (011) 22424184
Mobile : 98100-72961, email : oberoi@chandamama.org





© The stories, articles and designs contained in this issue are the exclusive property of the Publishers. Copying or adapting them in any manner/ medium will be dealt with according to law.



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# ప్రకాశవంతమైన జీవితానికి....

భయం నీలినీడలు సోకని ప్రశాంత ప్రపంచంలో సుఖసంతోషాలతో జీవించాలనే ప్రతి ఒక్కరూ కోరుకుంటారు. అలాంటి ప్రకాశవంతమైన ఆదర్శజీవితానికి కొన్ని ప్రధాన అంశాలు కావాలంటారు మన రాష్ట్రపతి డా. అబ్దుల్ కలామ్. ఆయన ఇటీవల విద్యార్థుల నుద్దేశించి ప్రసంగిస్తూ, ఇందుకు ఒక సూత్రాన్ని క్రోడీకరించారు: విలువలతో కూడు కున్న విద్య; ఆధ్యాత్మిక పరిణతి చెందిన మతం; నూతన విషయాలను తెలుసుకోవాలన్న ఆసక్తి, కనుగొనే సమర్థత; జ్ఞానాన్ని పంచుకునే ధైర్యం, సమస్యలను దీటుగా ఎదుర్కొనే తెగువ–ఇవి ఉన్నప్పుడే ప్రశాంత ప్రపంచంలో ప్రకాశవంతమైన జీవితం సాధ్యమవుతుంది!

మనిషిలో జ్ఞానాన్వేషణ, ఆదిమానవుడి జీవన పోరాటంలో అంతర్భాగంగానే ఆరంభ మయింది. కొందరు కొత్త కొత్త విషయాలను గురించి ఆలోచించి, అంతవరకు తెలియని వాటి కోసం ముందడుగు వేయడానికి సాహసించిన కారణంగానే ఇవాళ మనిషి ఇంతటి ఉన్నతస్థితికి చేరుకోగలిగాడు. ఈ అన్వేషణ వ్యక్తిగత అభిలాషతో ఆరంభమయినప్పటికీ, క్రమంగా అది యావత్ మానవజాతి అభివృద్ధికి దోహదం చేస్తుంది. దారిద్ర్యనిర్మూలన, అక్షరాస్యత విస్తరణలను మానవజాతి అభివృద్ధికి తొలి రెండు మెట్లుగా చెప్పవచ్చు.

విలువలతో కూడుకున్న విద్యమాత్రమే అర్థవంతం కాగలదని మన రాష్ట్రపతి అన్నారు. విద్య జ్ఞానాన్నిస్తుంది. విలువలు సత్ప్రవర్తన నిర్మాణానికి పునాదులు వేస్తాయి. విశాల మానవ ప్రపంచం గురించి ఆలోచింపజేసి మరింత ముందుకు నడిపిస్తుంది ధైర్యం!

సంపాదకుడు : విశ్వం

Visit us at : http://www.chandamama.org

# పాఠకుల లేఖలు

ఫిబ్రవరి '07 సంచికలో 'ఆలోచించవలసిన విషయాలు' గురించి సంపాదకీయంలో చక్కగా వివరించారు. నిజంగా ప్రతి తల్లీ, తండ్రీ ఈ విషయాన్ని సీరియస్‌గా తీసుకోవాలి. ఘోర కృత్యాలకు పిల్లలు బలికాకుండా శ్రద్ధవహించాలి.

–పులిజాల రవీందర్ రావు, హైదరాబాద్ – 500 070(ఆం.ప్ర)

నేను చందమామను 1953 నుంచి చదువుతున్నాను. నా వయస్సు ఇప్పుడు 58 ఏళ్ళు. సాధారణంగా ఎదిగే కొద్దీ మన అభిరుచులు మారుతూ ఉంటాయి అంటారు. అది చాలా వరకు నిజమే. ఒక్క చందమామ విషయంలో మట్టుకు అది అబద్ధం. నేను 1953 నుంచి 2007వరకు (మధ్యలో కొన్ని రాని రోజులు తప్పించి) ఒకే ఉత్సాహం, సంతోషంతో చందమామను చదువుతున్నాను. నా దగ్గర చాలా వరకు అన్ని చందమామలూ ఉన్నాయి. అవి నా ఆస్తి. ఎవరికీ ఇవ్వను. మొదటి చందమామ పత్రిక నుంచి యథా తథంగా మళ్ళీ ప్రచురించినా బావుంటుందనుకుంటాను. నాబోటి వాళ్ళకు అది ఎంతో ఆనందం కలిగించ గలదు!

– డి.పి. ప్రభావతి భట్టిప్రోలు, ప్రకాశం నగర్, హైదరాబాద్ (ఆం.ప్ర)

ఆరుపదులయౌవనం, అరవై వసంతాల ప్రయాణం
బాలల భవితకు ఓవరం, మానవ మేధస్సుకు ఓంకారం
బాలల పత్రిక ఇంత కాలం, మనుగడసాగించడం పుణ్యఫలం!

–డా. జి. జాన్‌కెనెడీ, గోల్కొండ, హైదరాబాద్ – 500 008(ఆం.ప్ర)

చందమామ ప్రథమ సంచిక నుంచి చదువుతున్న అనేకానేక పాఠకులలో నేనొకణ్ణి. పిల్లల సంచికనే పేరైనా పిల్లలూ, పెద్దలూ విడువక చదివేవారు. అలనాటి ఆ సంచికల్లో ధారావాహికంగా వచ్చిన అనేక పెద్ద కథలు ఇప్పటికీ పిల్లల్ని అలరిస్తాయి. ఆ సంచికలు ఇప్పుడు దొరకవు కాబట్టి, మీరు ధారావాహికంగా వచ్చిన ఆ పెద్ద కథలను చిన్న చిన్న పుస్తకాల రూపంలో సరసమైన ధరకు ప్రచురిస్తే ఉత్సాహంతో కొనే పాఠకులు అనేకులుంటారు.

–ఉడారి నరసింహ మూర్తి, హైదరాబాద్ – 500 008(ఆం.ప్ర)




# సాహసవీరుడు

చిన్నతనంలోనే తల్లితండ్రులను పోగొట్టుకున్న మనవడికి వీరయ్య అనిపేరుపెట్టి అల్లారు ముద్దుగా పెంచి పెద్ద చేసింది పాపాయమ్మ. చనిపోయిన భర్తలాగా తన మనవడు గొప్ప ధైర్యశాలి కావాలని ఆమె ఆశపడేది. అయితే, బాలారిష్ట రోగాలతో బలహీనంగా పెరిగిన వీరయ్య పిల్లిని చూస్తే పిచ్చిపట్టినట్టు అరిచేవాడు. ఎలుక కనిపిస్తే పారిపోయి దాక్కునే వాడు. బొద్దింక కనిపిస్తే భోరుమని ఏడ్చేవాడు! పాపాయమ్మ కొసరి కొసరి తినిపించినా వాడు గాలికి ఎగిరిపోయే పూచిక పుల్లలా ఉండేవాడు.

వీరయ్యకు పాతికేళ్ళు వచ్చేసరికి, పాపాయమ్మకు పెద్ద జబ్బు చేసింది. ఆమె ఇక అట్టే రోజులు బతకనని గ్రహించి, వీరయ్యను పిలిచి మంచం మీద కూర్చోబెట్టుకుని, "నీకు వీరయ్య అని పేరుపెట్టి తీరని అన్యాయం చేశాను. నీ వాలకం చూసి ఊళ్ళో వాళ్ళందరూ నిన్ను పిరికివీరుడని చెప్పి నవ్వుకుంటున్నారు. నువ్వు జీవితంలో కనీసం ఒక్క సాహస కార్యం అయినా చేసి పదిమంది మెప్పును పొందాలి. ధైర్యశాలి అనిపించుకోవాలి. అదే నా కోరిక," అన్నది కన్నీళ్ళతో.

ఆ రోజు రాత్రే ఆమె కన్నుమూసింది. తనను పిరికివాడని హేళన చేస్తూన్న ఆ ఊళ్ళో తను ఎంత సాహసకార్యం చేసినా ఎవరూ మెచ్చుకోరని వీరయ్య భావించాడు. ఏదైనా సాహస కార్యం చేసి అవ్వ చివరి కోరిక తీర్చాలన్న పట్టుదలతో, ఒక రోజు వేకువ జామునే లేచి వాడు ఆ ఊరు వదిలి బయలుదేరాడు.

వాడు సాయంకాలం దాకా నడిచి ఒక కొండ చరియ గ్రామం చేరుకున్నాడు. ఆ ఊరి రచ్చబండ వద్ద కొందరు, గొర్రెల కాపరులకు ప్రాణసంకటంగా మారిన పులిని గురించి మాట్లాడుకుంటున్నారు. వీరయ్య వాళ్ళకు తనను తాను పరిచయం చేసుకుని, "ఇక మీకు విచారం వద్దు. ఏదైనా సాహస కార్యం చేయాలనే బయలుదేరాను. ఆ

మాచిరాజు కామేశ్వరరావు




పులిని నేను చంపుతాను,'' అన్నాడు చాలా ఉత్సాహంగా.

''చూడడానికే మహావీరుడిలా ఉన్నావు. నీ పేరు చెబితేనే పులి తారెత్తుకుని పారి పోగలదు,'' అంటూ నవ్వేశారు అక్కడి వాళ్ళు వాడి రూపం చూసి.

అయితే, ఇద్దరు ముసలివాళ్ళు వీరయ్యను చెరువు గట్టు మీద ఉన్న మర్రిచెట్టు వద్దకు తీసుకువెళ్ళారు. ఒక బాణం, బల్లెం వీరయ్య చేతికిచ్చి, ''ఈ చెట్టుపై కూర్చున్నావంటే, రాత్రి పూట పులి నీళ్ళు తాగడానికి చెరువుకు వస్తుంది. పైనుంచి బాణం వేసి చంపవచ్చు,'' అని చెప్పి వెళ్ళిపోయారు.

వీరయ్య చెట్టెక్కి కూర్చున్నాడు. చూస్తూం డగానే చుట్టూ చీకట్లు కమ్ముకున్నాయి. భయంతో వాడికి చెమటలు పోశాయి. అంతలో చెట్టు కింద చేరిన నక్క ఒకటి గట్టిగా ఊళ పెట్టింది. ఆ శబ్దానికి ఉలిక్కిపడిన వీరయ్య చేతిలోని బాణం వదిలేశాడు. తెల్లవార్లూ భయంతో వణుకుతూ కూర్చు న్నాడు. వెలుగు రాగానే నక్క వెళ్ళిపోయింది. ''ఇంకానయం. పులి గాండ్రించి ఉంటే, ప్రాణమే పోయి ఉండేది!'' అనుకుంటూ వీరయ్య గబగబా చెట్టు దిగి, ఊరి వాళ్ళె వరూ రాకముందే, చేతిలో బల్లెంతో కనబడిన దారిగుండా ముందుకు నడిచాడు.

సాయంత్రానికి వాడు మరొక ఊరు చేరి, ''ఈ ఊళ్ళో నేను చేయగల సాహసకార్యం ఏమైనా ఉందా?'' అని ఊరివాళ్ళను అడి గాడు.

''గజదొంగ గంగులు తరచూ మా ఊరి మీద పడి దోచుకుంటున్నాడు. వాడి పీడ విరగడ చేశావంటే మా ఊరికి ఉపకారం చేసిన వాడవవుతావు,'' అన్నారు ఆ ఊరి ప్రజలు.

''అదెంతపని,'' అంటూ వీరయ్య ఊరి వాళ్ళు చూపిన దారిగుండా గజదొంగ గంగులు స్థావరమైన తూరుపు కొండలవైపు బయలు దేరాడు.

కొండ ప్రాంతం సమీపిస్తూండగా వీర య్యకు గుర్రాల డెక్కల చప్పుడు వినిపిం చింది. తల పైకెత్తి చూసిన అతడికి దౌడు తీస్తూ వస్తూన్న గుర్రాలూ, వాటి మీద నల్లటి దుస్తుల్లో ఉన్న దొంగలూ కనిపించారు. పక్కకు పారిపోదామనుకున్నాడు కానీ, భయంతో కాళ్ళు రాక, అలాగే శిలలా బాట

మధ్యలో నిలబడిపోయాడు. "ఎవడివిరా నువ్వు? మా దారికే అడ్డు రావడానికి ఎన్ని గుండెలు?" అంటూ దొంగలు వాణ్ణి చుట్టు ముట్టి, వాడి చేతిలోని బల్లెం లాక్కుని దూరంగా విసిరి కొట్టారు.

గజదొంగ గంగులు సర్రున కత్తి దూసి, కత్తిమొనను వీరయ్యమెడకు ఆనించి, "మా స్థావర రహస్యాలు తెలుసుకోవడానికి వస్తున్నావా ఏం? ఎవరు నువ్వు? చెప్పు," అంటూ కళ్ళెర్ర చేశాడు.

గుబురు మీసాలతో, క్రూరమైన చూపులతో, కారునలుపు నిలువెత్తు గంగులు రూపం చూడగానే వీరయ్యకు నోరు పిడచ కట్టుకు పోయింది. ఎంత ప్రయత్నించినా నోరు మెదపలేక, "బె... బె... బె..." అంటూ నీళ్ళు నమలసాగాడు.

వీరయ్యను మూగవాడిగా భావించి, గంగులు కత్తిని చప్పున వెనక్కు తీసుకున్నాడు. వాడికి పెళ్ళయిన పన్నెండేళ్ళకు కొడుకు పుట్టాడు. అయితే, వాడు పుట్టు మూగ. అందుకే గంగులు మూగవాళ్ళకు ఎలాంటి అపకారమూ చేయడు. "ఈ కొండలలోని మాస్థావరం వైపు వెళ్ళి నీ మూగ ప్రాణాన్ని బలిచేసుకోకు. నీ దారిన నువ్వు వెళ్ళు," అని చేత్తో సైగ చేసి తన అనుచరులతో వెళ్ళిపోయాడు గంగులు.

బతుకు జీవుడా అనుకుంటూ అక్కడి నుంచి బయలుదేరిన వీరయ్య మరునాటి మధ్యాహ్నానికి వేరొక ఊరును సమీపించాడు.

ఊరిమొదట్లోనే పదిమంది స్త్రీపురుషులు బిగ్గరగా ఏడుస్తున్నారు. వాళ్ళను చూసి, "ఎందుకలా ఏడుస్తున్నారు? నేను ఏదైనా






సాహసకార్యం చేయాలని బయలుదేరాను. మీ కష్టం నాకు చెప్పండి. తొలగిస్తాను,'' అన్నాడు వీరయ్య.

వాళ్ళు గట్టిగా చప్పట్లు చరిచి, ముందు వెళుతూన్న ఒంటెద్దు బండిని వెనక్కు రప్పించారు. ఆ బండి నిండా వంటకాలున్నాయి.

''ఇప్పటికే ఆలస్యమయింది. ఎందుకు నన్ను వెనక్కు పిలిచారు?'' అని అడిగాడు బండి తోలుతూన్న లావుపాటి మనిషి.

''నువ్వు బండి దిగు. ఈ యువకుడు ఏదైనా సాహసకార్యం చేయాలని బయలుదేరాడట. ఒంటికొమ్ము రాక్షసుణ్ణి హతమార్చడానికి మించిన సాహసకార్యం ఏముంటుంది?'' అన్నారు ఊరివాళ్ళు.

దగ్గరిలోని కొండ గుహల్లో ఉంటూ ఊరి మీద పడి జనాన్ని ఇష్టంవచ్చినట్టు తినకుండా, బకాసురుడికి పంపినట్టు రోజూ బండెడు కూడు, ఒక ఎద్దు, ఒక మనిషిని పంపిస్తామని ఆ ఊరివాళ్ళు ఒంటికొమ్ము రాక్షసుడితో ఒప్పందం కుదుర్చుకున్నారు.

''నీ మేలు మరవలేం. వెళ్ళి ఆ రాక్షసుణ్ణి హతమార్చి రా,'' అంటూ వీరయ్యను బండి ఎక్కించారు ఊరివాళ్ళు. బండి కొండదారి వెంట బయలుదేరింది.

మరి కొంత సేపటికి బండి కొండ గుహలను సమీపించింది. ఆహారం రావడం ఆలస్యమయిందన్న ఆగ్రహంతో పెడబొబ్బలు పెడుతూ, బండరాళ్ళు దొర్లిస్తూ నానా బీభత్సం చేస్తూన్న ఒంటికొమ్ము రాక్షసుడి భీకరాకారం చూసి, వీరయ్య భయంతో వణుకుతూ బండిపై నుంచి కింద పడ్డాడు. గాలికి రెప రెపలాడే పూచిక పుల్లలాంటి వీరయ్య రూపం, వాడి వణుకుతున్న దేహాన్ని చూసిన రాక్షసుడికి అంత ఆకలిలోనూ నవ్వు ఆగలేదు. దిక్కులు పిక్కటిల్లేలా నవ్వాడు. దాంతో వీరయ్య స్పృహతప్పి పడిపోయాడు.

కొంత సేపటికి ఎవరో ముఖం మీద నీళ్ళు చిలకరించినట్టవడంతో వీరయ్య కళ్ళు తెరిచాడు. ఎదురుగా నిలబడ్డ ఒక మధ్య వయస్కుడు, ''భయపడకు నాయనా,'' అన్నాడు.

''రాక్షసుడెక్కడ?'' అని అడిగాడు వీరయ్య భయం భయంగా.

''ఇక రాక్షసుడు రాడు నాయనా,'' అంటూ అతడు తన గురించి ఇలా చెప్పాడు:

అతడొక వడ్డీవ్యాపారి. పేరు నీలకంఠం. శాపవశాన రాక్షసరూపం పొందినవాడు. సాధు

సన్యాసులంటే అతనికి చులకన భావం. ఒక సారి తీర్థయాత్రలకని వెళుతూన్న నలుగురు సాధువులను ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు. సాధువులు భోజనానికి కూర్చోగానే, ఆకుల్లో బియ్యం, పచ్చి కూరగాయలు వడ్డించి, ''సాధుపుంగవులకు బియ్యం, అన్నం తేడా ఏమిటి? తృప్తిగా ఆరగించండి,'' అంటూ హేళనగా నవ్వాడు.

ఒక సాధువు, ''దురహంకారంతో నవ్వుతూన్న నువ్వు, నవ్వడమే తెలియని రాక్షస రూపంలో ఆకలితో అలమటింతువుగాక!'' అని శపించాడు. తప్పు క్షమించమని నీలకంఠం సాధువు పాదాలపై బడి వేడుకున్నాడు. ''అప్రయత్నంగా నువ్వు నవ్వినప్పుడే నీకు శాపవిమోచనం,'' అని చెప్పి సాధువులు వెళ్ళి పోయారు. మరుక్షణమే ఒంటికొమ్ము రాక్షసుడిగా మారి ఇన్నాళ్ళు ఆకలితో అలమటించిన నీలకంఠానికి, వీరయ్యను చూసి అప్రయత్నంగా నవ్వడంతో రాక్షస రూపం పోయి అసలు రూపం వచ్చింది!

ఆ తరవాత వీరయ్య, నీలకంఠం ఇద్దరూ బండి మీద గ్రామానికి బయలుదేరారు. బండెడు ఆహారంతో వెళ్ళినవాడు వెళ్ళినట్టు, మరొక మనిషిని వెంటబెట్టుకుని వస్తూన్న వీరయ్యను దూరం నుంచి చూసి గ్రామస్థులు విస్తుపోయారు. వీరయ్యను చూడగానే ఒంటికొమ్ము రాక్షసుడు భయపడి దూర ప్రాంతానికి పారిపోయాడని నీలకంఠం వాళ్ళకు చెప్పాడు. ఆ మాట వినగానే, 'సాహస వీరుడికీ జై' అంటూ గ్రామస్థులు హర్షధ్వానాలు చేశారు. రాక్షస బాధ పోగొట్టిన వీరయ్యకు కానుకలిచ్చి సాగనంపారు.

సాహస కృత్యం చేయాలని బయలుదేరిన వీరయ్య ఒక రాత్రంతా చెట్టు మీద గడపడం; గజదొంగ గంగులుకు ఎదురు వెళ్ళడం; ఒంటికొమ్ము రాక్షసుణ్ణి సమీపం నుంచి చూడడం ఒకటి వెంట ఒకటి జరగడంతో వాడిలోని పిరికితనం మటు మాయమయింది. గ్రామస్థులతన్ని సాహసవీరుడని పొగడడంతో అతనిలో ఆత్మవిశ్వాసం పెరిగి, నిజంగానే ధైర్యవంతుడయ్యాడు. ప్రజల చేత సాహసవీరుడనిపించుకుని అవ్వ చివరి కోరికను తీర్చినందుకు వీరయ్య ఎంతగానో సంతోషించాడు.



# భయంలేనివాడు

రాజు విక్రమసేనుడికి తరచూ ఏవేవో సందేహాలు వస్తూండేవి. తన సందేహాలకు సమాధానాలను ప్రత్యక్షంగా నిరూపించమని మంత్రులను కోరేవాడు. ఒకనాడు రాజు మంత్రి సుబుద్ధిని, ''ఈ లోకంలో భయంలేనివారు ఎవరైనా ఉంటారా?'' అని అడిగాడు.

''రాత్రికి మనం నగర సంచారం చేస్తే, అలాంటి వాళ్ళు కనిపించవచ్చు, ప్రభూ,'' అన్నాడు మంత్రి.

ఆ రాత్రి రాజూ, మంత్రీ మారువేషాల్లో నగర సంచారానికి బయలుదేరారు. నగరం చివర ఒక పూరిగుడిసె ముందు ఒక యువకుడు నులకమంచం మీద పడుకుని నిద్రపోతున్నాడు. రాజూ, మంత్రీ ఆశ్చర్యంతో ఆ యువకుణ్ణి నిద్రలేపి, ''ఇంటి తలుపు బార్లా తెరిచి ఇలా బయట పడుకుని నిద్రపోతున్నావే, నీకు భయం లేదా?'' అని అడిగారు.

''భయమా? నాకా? ఎందుకూ? నా ఇంట్లో దొంగలు పడి దోచుకోవడానికి ఏముందని తలుపులు మూయడం? కట్టెలు కొట్టి అమ్మి దాంతో పొట్టపోసుకుంటున్నాను. ముందూ వెనకా ఎవరూ లేనివాణ్ణి. నేను చచ్చినా బాధపడేవాళ్ళు లేరు. నాకూ ప్రాణభయం లేదు. ఇక భయపడడం దేనికి? ఈ విషయం అడిగేందుకా బంగారంలాంటి నిద్ర చెడగొట్టారు?'' అంటూ మళ్ళీ ముసుగుదన్ని పడుకున్నాడా యువకుడు.

''ఈలోకంలో భయంలేని వాళ్ళెవరైనా ఉన్నారంటే, వాళ్ళు ప్రాణభయం లేని నిరుపేదలైన కష్టజీవులు మాత్రమే!'' అంటూ రాజు ముందుకు నడిచాడు.

మంత్రి ఆయన్ను అనుసరించాడు.

–మందరపు సోమశేఖరాచార్యులు






# రాకాసిలోయ

## 20

[కేశవుడూ, జయమల్లూ, చండమండూకుడి గుడిసెలో బందీ అయిన కోయయువకుణ్ణి రక్షించారు. తరవాత వాళ్ళు చండమండూకుడు అక్కడి నుంచి పారిపోయిన రహస్య సొరంగ మార్గం తెలుసుకున్నారు. ఈ లోపల చండమండూకుడు, ఒక అనుచరుడితో సొరంగ మార్గం నుంచి, అడవి మధ్య వున్న ఒక పాడుపడ్డ బావి కుండా పైకి వచ్చి, బ్రహ్మదండి మాంత్రికుణ్ణి తిట్టసాగాడు. -తరవాత]

చండమండూకుడి అనుచరుడికి, తమ నాయకుడు బ్రహ్మదండిని తిట్టటం గాని, అతణ్ణి అనుమానించటం గాని, ఏమాత్రం సబబుగా కనిపించలేదు. బోలెడు ధనం ఇచ్చి, బ్రహ్మపుర రాజు చేత అర్ధ రాజ్యం ఇప్పించగలనని వాగ్దానం చేసిన బ్రహ్మదండి, మండూకుణ్ణి చంపేందుకు మనుషుల్నెందుకు పంపుతాడు? పైగా, ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ లేనిదే రాకాసిలోయలో తను సాధించగలిగిందేమీ లేదని, బ్రహ్మదండి ముందుగానే మండూకుడికి చెప్పి, వాళ్ళను పట్టుకునే పని అతడికి ఒప్పగించాడు. ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ ఈ లంకకు చేరటంలో ఏదో రహస్యం వున్నది...

చండమండూకుడి అనుచరుడు ఇలా ఆలోచిస్తూ, తమ నాయకుడి ముందుకు వచ్చి, "మండూకేశ్వరా, తొందరపడకండి. ఆ దుర్మార్గులిద్దర్నీ పంపినవాడు బ్రహ్మదండి కాడని నా అనుమానం. మనసహాయం కోరిన ఆ మాంత్రికుడు మనను చంపించే ప్రయత్నం



ఎందుకు చేస్తాడు? ఇందువల్ల అతడికి కలిగే లాభం ఏమిటి? ఆలోచించాలి,'' అన్నాడు.

''ఆలోచించు... తీరిగ్గా ఆలోచించు!'' అంటూ ముండూకుడు గట్టిగా కసురుకుని, ''ముందు నువ్వెళ్ళి, ఆ బ్రహ్మదండి భడవాని ఇక్కడికి తీసుకు రా,'' అంటూ కళ్ళెర్రచేశాడు.

మండూకుడి అనుచరుడు పెద్ద పెద్ద అంగలేస్తూ రావటం, కొండ అంచున వున్న గుడారాల ముందు కూచుని మాట్లాడు కుంటున్న బ్రహ్మదండి మాంత్రికుడూ, అతడి అంగరక్షకులైన, జితవర్మా, శక్తివర్మలూ చూశారు. నరభక్షకుడి వాలకం వాళ్ళ ముగ్గ రిలో భయాశ్చర్యాలను కలిగించింది.

బ్రహ్మదండి, జిత శక్తివర్మల కేసి తల తిప్పి, ''జితా, శక్తీ, చూశారా మనకేసి వస్తూన్న, మండూకుడి అనుచరుడి ముఖ లక్షణాలు. వాడేదో మాంచి కోపంలో వున్నట్టున్నాడు. మనకేం ప్రమాదం లేదు గదా!'' అన్నాడు నిస్పృహగా.

''అసలు ఈ నరభక్షకులతో స్నేహం కలపటమే ప్రమాదం. నే వొద్దని ఎంత మొత్తు కున్నా, విన్నావు కాదు,'' అన్నాడు జితవర్మ.

''మనం స్నేహితులమని చెప్పి, డబ్బూ, రాజ్యం వస్తుందన్న ఆశ చూపకపోతే, మనను మండూకుడు ఎప్పుడో కాల్చుకు తినేసేవాడు. ఒకసారి వాళ్ళకు చిక్కిన తరవాత, మనం చేయగలిగిందేముంది; నిస్సహాయులం. అంతా ఆ కాలభైరవుడి అధీనం,'' అన్నాడు బ్రహ్మదండి.

సంభాషణ ఇలా జరుగుతున్నంతలో, మండూకుడి అనుచరుడు అక్కడికి రానే వచ్చాడు. వస్తూనే వాడు, బ్రహ్మదండి కేసి కోపంగా చూస్తూ, ''బ్రహ్మదండీ, నీ రోజులు ముగిసినై. మా నాయకుడు నిన్ను నిలువునా కాల్చుకు తింటానంటూ కారాలూ మిరి యాలూ నూరుతున్నాడు,'' అన్నాడు.

''నన్నా? కాల్చుకు తినటమా? ఆశ్చర్యం! ఆ మండూకేశ్వరుడికి నేను చేసిన ద్రోహం ఏమిటి? బ్రహ్మపుర రాజ్యంలో అర్ధ రాజ్యం ఇప్పిస్తానని కూడా మాట ఇచ్చానే,'' అంటూ బ్రహ్మదండి బింకం నటించాడు.

''అర్ధరాజ్యం మాట భద్రమండూకుడె రుగు! నువ్వు, మా నాయకుణ్ణి చంపించేం దుకు, ఆ జ్యేష్ఠుణ్ణీ, కనిష్ఠుణ్ణీ ఆయన భవంతి దగ్గిరకు పంపావు, అవునా?'' అని ప్రశ్నించాడు మండూకుడి అనుచరుడు.

జ్యేష్ఠుడు, కనిష్ఠుడు అన్న పేర్లు వింటూనే బ్రహ్మదండి మాంత్రికుడు, కూచున్న చోటు

నుంచి ఎగిరి లేచి, ''హా, కాలభైరవా, ఎన్నాళ్ళకు నీ భీకరదృష్టి నా మీదికి ప్రసరించింది! జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ దొరికారా?'' అంటూ జిత శక్తివర్మల కేసి తిరిగి, ''మీకూ తెలుసు గదా, వాళ్ళు జయమల్లూ, కేశవుడని? ఇక లేవండి, బయలుదేరండి. మన ప్రయాణం సూటిగా రాకాసిలోయకే,'' అంటూ చిందులు తొక్కసాగాడు.

మండూకుడి అనుచరుడు ముందుకు వచ్చి, బ్రహ్మదండి భుజం పట్టుకుని ఒక్క తోపుతోస్తూ, ''కపటనాటకం ఆడకు! ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ దొరికారని నీకెవరు చెప్పారు? ఆ దుర్మార్గుల నుంచి తప్పించుకుని ప్రాణాలతో బయటపడటంలో నాకూ, మండూకేశ్వరుడికీ తలప్రాణం తోకకు వచ్చింది,'' అన్నాడు.

''అయితే వాళ్ళిప్పు డెక్కడున్నారు? ఇంకా మండూకేశ్వరుడి భవనంలోనే వున్నారా? క్షణాలమీద వాళ్ళను పట్టేస్తాను. జితా, శక్తీ, లేవండి,'' అంటూ బ్రహ్మదండికేకలు వేశాడు.

బ్రహ్మదండి మాంత్రికుడి ఆదుర్దా, అతడి మాటల తీరూ చూసిన తరవాత, మండూకుడి అనుచరుడికి, అతడు నిర్దోషి అన్న నమ్మకం కలిగింది. జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ బ్రహ్మదండి పంపగా వచ్చిన వాళ్ళని, తమ నాయకుడు అనుకోవటం పొరపాటని, అతడికి తెలుసు. ఇప్పుడు తను వేసిన పేచీతో నిజం తెలిసిపోయింది. కాని, మండూకుడి కోపాన్ని శమింపచేయటం ఎలా?

మండూకుడి అనుచరుడు ఓ క్షణకాలం ఆలోచిస్తూ వూరుకుని, తరవాత బ్రహ్మదండిని



దూరంగా తీసుకుపోయి, జిత శక్తివర్మలకు వినబడని విధంగా స్వరం తగ్గించి, ''మా నాయకుడు నువ్వంటే మండిపోతున్నాడు,'' అంటూ జరిగిందంతా చెప్పి, ''ఒకవేళ నువ్వు నిర్దోషివని ఎంత చెప్పినా, మా నాయకుడు నమ్మకపోతే ఏదో మంత్రం వల్లించినట్టు నటించి, జ్యేష్ఠుణ్ణీ, కనిష్ఠుణ్ణీ ఆయన భవంతి దగ్గరకు పంపిన వాడు జితవర్మో, శక్తివర్మో అని చెప్పెయ్యి. ఆ ఇద్దర్లో ఒకడి పీడ విరగడ అవుతుంది. నువ్వు రానున్న ప్రమాదాన్నుంచి అతి సులభంగా బతికి బయటపడతావు,'' అన్నాడు.

ఆ మాటలతో బ్రహ్మదండికి ప్రాణం కుదుటపడింది. అతడు మెల్లిగా తల తిప్పి జిత శక్తివర్మల కేసి చూసి, ''మండూకానుచరాగ్రణీ! మీరు చెప్పింది మహబావుంది. ఒక్క గొప్పవాడి ప్రాణరక్షణకు గాను, వెయ్యి



మంది అల్లులను బలి చెయ్యవచ్చని శాస్త్ర గ్రంథాలన్నీ మూకవుమ్మడిగా మొరపెడుతున్నవి. ఇక బయలుదేరండి. ఆ మండూకేంద్రుల వారి సన్నిధానానికి వెళ్ళి వారి దివ్య దర్శనభాగ్యం కలిగించుకుందాం,'' అన్నాడు.

మండూకుడి అనుచరుడూ, బ్రహ్మదండీ ముందు నడవసాగారు. వెనకగా వస్తున్న జిత, శక్తివర్మలకు, వాళ్ళిద్దరూ రహస్యంగా మాట్లాడుకున్న దేమిటో తెలియక పోవటంతో భయం పట్టుకున్నది. కాని, పారిపోయే ప్రయత్నం చెయ్యటం వృథా. లంకలో తమ కొక్క స్నేహితుడు లేడు, అంతా నరభక్షకుల మయం!

నలుగురూ చండమండూకుడున్న పాడుపడ్డ బావి ప్రాంతాల కొచ్చేసరికి అక్కడ మండూకుడు ఇద్దరు నరభక్షకులకు ఏవో సంజ్ఞలు చేస్తూ, మధ్యమధ్య బావిలోకి తొంగి చూస్తున్నాడు. అది గమనించిన, అతడి అనుచరుడూ, బ్రహ్మదండీ నిశ్శబ్దంగా మండూకుణ్ణి సమీపించారు. మండూకుడు వాళ్ళను బావి దగ్గిర నుంచి, కొంచెం ఎడంలోవున్న చెట్ల కిందకు తీసుకుపోయి ప్రాణభయంతో వణుకుతున్న బ్రహ్మదండితో, ''బ్రహ్మదండీ, భయపడకు! నువ్వేదో ద్రోహం చేశావని ఇంతకు ముందు అనుమానించాను. కాని, అడవి నుంచి తిరిగివచ్చిన నా అనుచరుల ద్వారా, ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ ఈ లంక కెలా చేరారో తెలుసుకున్నాను. వాళ్ళు బానిసల గుంపు నుంచి విడివడి నదిలోకి దూకి, ఈ లంక చేరారట., సరే, ప్రస్తుత ముఖ్య విషయం అది కాదు. వాళ్ళిద్దరూ మనకిప్పుడు బోనులో చిక్కిన సింహాలు,'' అంటూ బావి కేసి చేయి వూపి, ''వాళ్ళిప్పుడు నా భవనం నుంచి ఇక్కడికి వున్న సొరంగమార్గం గుండా వస్తున్నారు. ఆ చివర మనవాళ్ళను కాపలా పెట్టాను. కొందరు సొరంగమార్గంలోకి దిగి వాళ్ళనిటు తరుముకు వస్తున్నారు. మనం ఇక్కడ మాటువేసి, బావిలో నుంచి వాళ్ళు బయిటికి రాగానే సజీవులుగా పట్టుకోవాలి. తెలిసిందా?'' అన్నాడు.

మండూకుడిలా చెప్పగానే, బ్రహ్మదండి మాంత్రికుడికి కలిగిన ఆనందం అంతా ఇంతా కాదు. అతడి కళ్ళ ముందు రాకాసిలోయలోని ధనరాసులన్నీ గిర్రున తిరిగినై. అతడు జిత, శక్తివర్మల దగ్గిరకు వెళ్ళి రహస్యంగా, ''మండూకుడు చెప్పింది విన్నారు కదా? ఆ కేశవుణ్ణీ, జయమల్లునూ ప్రాణాలతో పట్టుకోండి. బహుశా వాళ్ళ దగ్గిర ఆయుధాలు

వుండి వుంటవి. తప్పని సరైతే ఆత్మరక్షణకు జయమల్లును చంపండి కాని, కేశవుడికి మాత్రం ఎలాంటి హానీ కలిగించకండి. తెలిసిందా?'' అన్నాడు.

ఆ తరవాత అందరూ కలిసి బావి దగ్గిరకు వెళ్ళి దాని అంచున పొంచి కూచున్నారు. మండూకుడు మధ్యమధ్య కూచున్నచోటు నుంచి లేచి, బావిలోకి తొంగిచూసి, దాని గట్టు మీద చెవి ఆనించి విని, ''శబ్దమవుతున్నది. వాళ్ళిటే వస్తున్నారు,'' అని మెల్లిగా తన పక్కనున్న వాళ్ళతో చెప్పసాగాడు.

చండమండూకుడు అనుకున్నట్టు, కేశవుడూ, జయమల్లూ, కోయయువకుడూ సొరంగ మార్గం కుండా అటుకేసే వస్తున్నారు. వాళ్ళు గుడిసెలో వున్న సొరంగాన్ని కనుక్కున్న తరవాత, మండూకుడి కోసం అక్కడున్న గదులూ అవీ వెతికి, అతడు లేడని గ్రహించి, తిరిగి గుడిసెలోకి పోదామనుకునేంతలో, అక్కడ అలికిడీ, సొరంగ ద్వారాన్ని కప్పివున్న తలుపు తెరవటం వాళ్ళకు కనిపించింది. వెంటనే వాళ్ళు ప్రమాదాన్ని గ్రహించి, కాగడాల వెలుగులో సొరంగం వెంట దాని రెండవ చివరి కేసి బయలుదేరారు.

''మనం ఇందులో వున్న సంగతి మండూకుడి అనుచరులకు తెలిసిపోయింది. వాళ్ళు మన కోసమే వస్తున్నారు,'' అన్నాడు కోయయువకుడు.

కేశవుడు అవునన్నట్టు తల వూపాడు. జయమల్లు వెలుగుతున్న కాగడాతో సొరంగ మార్గాన ముందుకు నడుస్తూ, ''మనకు దీని వెంట పడి, ఇది ఎక్కడికి చేరిస్తే, అక్కడికి



చేరటం ఒక్కటే వున్న దారి. మండూకుడు ఆ చివర కూడా కాపు పెట్టకపోతే, మనం బతికి బయటపడగలం. అలా కాకపోతే, ప్రాణం వున్నంతవరకూ పోరాడదాం,'' అన్నాడు.

''అంతకాక చేసేందుకు మరేముంది? నరభక్షకులకు ఆహారం అయ్యే ముందు వాళ్ళల్లో కొందరినైనా, మన కత్తులకు ఆహారం చేద్దాం,'' అన్నాడు కేశవుడు. కోయయువకుడు అవునన్నట్టు తలాడించాడు.

ఆ విధంగా వాళ్ళు సొరంగమార్గం కుండా నడిచి పాడుబడిన బావిని సమీపిస్తున్నంతలో, పైనుంచి అలికిడి వినబడింది. వెంటనే ముందు నడుస్తున్న జయమల్లు ఆగి, కేశవుడి తో మెల్లిగా, ''మనం భయపడ్డంతా అయింది. వాళ్ళు మనకోసం కాపలా వేశారు,'' అన్నాడు.

కేశవుడు ఏదో అనబోయేంతలో వెనక నుంచి వేగంగా సమీపిస్తున్న అడుగుల చప్పుడూ, గుడ్డివెలుగూ కనిపించింది. వెంటనే ముగ్గురూ తమ తమ ఆయుధాలు గుప్పెళ్ళలో గట్టిగా బిగించి పట్టుకున్నారు. కేశవుడు, జయమల్లును తోసుకుని ముందుకు వస్తూ, "వెన్నంటి వస్తున్న శత్రువులు మన మీద పడకముందే, మనం ముందుకు వెళ్ళి అపైన కాపలావున్న వాళ్ళ పనిపట్టాలి. ఆ విధంగా మనకు ప్రాణాలతో బయటపడే అవకాశం చిక్కవచ్చు," అన్నాడు.

ఆ వెంటనే ముగ్గురూ వేగంగా ముందుకు పరిగెత్తసాగారు.

"హేయ్, ఆ దుర్మార్గులు వచ్చేస్తున్నారు, ప్రాణాలతో పట్టుకోండి," అంటూ చండ మండూకుడు కేకపెట్టాడు. వాడి అనుచరులూ, జిత, శక్తివర్మలూ ఆయుధాలు చేతబట్టి లేచి నిలబడ్డారు.

"కేశవుడికేమీ ప్రమాదం కలగకూడదు. వాడు వెంటలేందే మనం రాకాసి లోయలో ఏమీ చేయలేం. జితా, శక్తీ, జాగ్రత్త! వాడికేమైనా ప్రమాదం జరిగిందో మిమ్మల్ని నిలువునా, భస్మం చేసేస్తాను. తరవాత విచారించి లాభంలేదు," అంటూ బ్రహ్మదండి కేక పెట్టాడు.

బ్రహ్మదండి మాంత్రికుడి కేకకు జవాబా అన్నట్టు, కేశవుడూ, జయమల్లూ, కోయ యువకుడూ ఒక్క ఊపులో బావి నుంచి పైకెగిరివస్తూ, సింహాల్లా గర్జించారు. అదే సమయంలో దాపులవున్న గుబురుచెట్ల లోంచి, "గురుమౌనానందులకూ, జై!" అన్న కేకలు వినిపించినై. మరుక్షణంలో, ఒక పెద్ద గొంతు, "విప్పచెట్ల మీద వున్న ఇరవైమంది యోధులూ, ముందు దిగి; ఆ బ్రహ్మదండినీ, మండూకుణ్ణీ పట్టుకోండి! నేరేడుచెట్ల చాటున వున్న నలభైయిద్దరూ, బావిలోకి దూకి; సొరంగ మార్గాన వస్తున్న నరభక్షకుల్ని నరకండి!" అంటూ హెచ్చరించింది.

ఆ హెచ్చరిక వింటూనే "భద్రమండూకా!" అంటూ మండూకుడూ, "ఉపాసకుల ఊడలమర్రీ, కాలభైరవా!" అంటూ బ్రహ్మదండి మాంత్రికుడూ బావి దగ్గర నుంచి ఎగిరి గంతేసి, అడవిలోకి పారిపోయేందుకు పరిగెత్తసాగారు. -(ఇంకావుంది)





## బేతాళ కథలు

# చిన్నతనం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఎవరిమీద పంతం పట్టి నువ్వు ఇలా అర్ధరాత్రి వేళ అరణ్యం మధ్య అవస్థ పడుతున్నావో తెలియదు. అయితే, ఆవేశంతో కొందరు పంతానికి దిగి, ఆవేశం చల్లారాకపంతాన్ని గాలికి వదిలేస్తూ ఉంటారు. నువ్వు అలాంటి వారి కోవకు చెందిన వాడవు కాదని భావిస్తున్నాను. తనను హేళన చేసిన వారి మధ్య ఉండలేనన్న పంతంతో, పుట్టి పెరిగిన ఊరు వదలిపెట్టి, తరవాత కొన్నాళ్ళకు అలాంటి వారి మధ్యే ఉండాలని నిర్ణ



యించిన అకాలుడనే యువకుడి కథ చెబు తాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

నాగరిక ప్రపంచానికి దూరంగా నాలుగు వైపులా కొండలుగల మారుమూల గ్రామం అనగరం. వ్యవసాయం జీవనాధారమైన ఆ గ్రామస్థులు మిగతావారికి భిన్నంగా తమ పొలాల్లో వింతరకం దినుసులు పండించే వారు. చుట్టు పక్కల కొండల నుంచి కంద మూలాలు సేకరించేవారు. ఉదయం నుంచి సాయంకాలం వరకు కాయకష్టం చేసేవారు. తాము ఆజానుబాహులుగా, దృఢకాయు లుగా ఉండడానికి కారణం తాము పండించే దినుసులేనని భావించేవారు. ఆ దినుసులు ఇష్టపడని వాడు ఆ ఊరి మొత్తానికి అకాలు డొక్కడే.

అకాలుడు చిన్నప్పటి నుంచి చదువుపట్ల అమితాసక్తి చూపేవాడు. గుడిపూజారి నుంచి పద్యాలు, శ్లోకాలు నేర్చుకునేవాడు. దేవాల యాల్లో భద్రపరిచిన తాళపత్ర గ్రంథాలు లభిస్తే, వాటిని చదువుతూ కాలం గడిపే వాడు. అకాలుడు పొట్టివాడు కాదుగాని, మిగతా గ్రామస్థుల ముందు మరుగుజ్జులా ఉండేవాడు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ కూర్చునేవాడి అనుమానాలు వింతగా ఉండేవి. పనీపాటూ లేకుండా అలా కూర్చున్నావేమని ఎవరైనా అడిగితే - తిండికోసమే బతికితే మనిషికీ, జంతువుకూ తేడా లేదనీ, మనిషన్న వాడు నేర్చుకోవలసిన విద్యలు చాలా ఉన్నా యనీ చెప్పేవాడు.

కొందరు వాణ్ణి చూసి నవ్వేవారు. మరి కొందరు హేళన చేసేవారు. అకాలుడు కొంత కాలం ఊరుకున్నాడుగాని, పద్దెనిమిదేళ్ళు వచ్చేసరికి, ఇక భరించలేక ఊరొదిలి వెళ్ళి పోతానని తండ్రికి చెప్పాడు. ఆయన నవ్వి, "ఊరు మారి లాభంలేదు. నువ్వు మారాలి," అన్నాడు.

"ఇక్కడి వాళ్ళంతా సామాన్య జీవితం గడుపుతున్నారు. వీళ్ళలా మారితే, సామాన్యు డిగా మారిపోతాను. అది నాకిష్టం లేదు. నేను దండకారణ్యంలోని భుజంగుడి గురు కులంలో చేరి, విద్య నభ్యసించి తిరిగి వచ్చి ఊరిని మార్చేస్తాను. అప్పుడు ఊరివారి మెప్పు పొందుతాను,'' అని చెప్పి ఊరొదిలి పెట్టాడు అకాలుడు. నాలుగు రోజుల ప్రయాణం తర్వాత అతడు దండకారణ్యం సమీపిస్తూం

డగా, ఒక రథం వచ్చింది. రథ సారథి అకా లుణ్ణి పలకరించి సంగతి తెలుసుకుని, ''మన మహారాజుగారు ఉన్నపళంగా భుజం గులవారిని వెంటబెట్టుకురమ్మని పంపితే వస్తున్నాను. రథం ఎక్కు. నిన్ను గురుకులం చేరుస్తాను,'' అన్నాడు.

అలా గురుకులం చేరుకున్న అకాలుడు భుజంగుణ్ణి కలుసుకుని తన ఆశయం చెప్పాడు. ఆయన సాలోచనగా, ''నువ్వు జంబకారణ్యం వెళ్ళి, వినయుడి గురు కులంలో చేరు. నా వద్ద శిష్యుడిగా చేరా లంటే, రెండేళ్ళయినా అక్కడ విద్యాభ్యాసం చెయ్యాలి,'' అన్నాడు.

''గురువర్యా, నా అర్హతపై తమకు అను మానంలాగున్నది. తమరేపరీక్ష పెట్టినా నా సామర్థ్యాన్ని నిరూపించుకోవడానికి సిద్ధంగా ఉన్నాను. పరీక్షించకుండా నన్ను జంబ కారణ్యం వెళ్ళమని శాసించకండి,'' అని అకాలుడు వేడుకున్నాడు.

భుజంగుడు తల పంకించి, ''నేనిప్పుడు రాజధానికి వెళ్ళి, వారం రోజుల్లో తిరిగి వస్తాను. ఈలోగా నేనిచ్చే రెండు గ్రంథాలను చదివి వాటి సారం గ్రహించి, తిరిగి రాగానే నాకు చెప్పాలి. సాధ్యంకాని పక్షంలో విన యుడి వద్దకు వెళ్ళిపో,'' అని అతనికి రెండు గ్రంథాలు ఇచ్చి రాజధానికి బయలుదేరాడు.

ఆయన అటువెళ్ళగానే గురుకులంలోని మిగతా శిష్యులు అకాలుణ్ణి సమీపించి, ''ఇప్పుడు నీ దగ్గరున్న గ్రంథాలను మేము రెండేళ్ళుగా పఠిస్తున్నాం. అడిగినప్పుడు



గురువుగారు మా సందేహాలు తీరుస్తున్నా, ఇప్పటికీ వాటి సారం మాకు తెలియలేదు. అలాంటిది నువ్వు వారం రోజుల్లో వాటి సారం గ్రహించడం అసాధ్యం,'' అన్నారు.

''అలా అయితే, దీన్ని నేను నా సామర్థ్యం నిరూపించుకునే అవకాశంగా తీసుకుం టాను,'' అన్నాడు అకాలుడు.

ఆ తరవాత అతడు ఆ గ్రంథాలను శ్రద్ధగా చదివి, నాలుగు రోజుల్లోనే వాటి సారాన్ని రాసి, మిగతా శిష్యులకు చూపించాడు. అయితే వాళ్ళు దాన్ని చదవకుండానే, అతడి ఆత్మవిశ్వాసాన్ని అహంకారంగా భావించి పరిహసించారు. అకాలుడు వాళ్ళ మాటలు లెక్క చేయక, ''ఎగతాళి నాకు కొత్తకాదు. నన్ను అర్థం చేసుకోవడంలో మీరూ, మా ఊరివాళ్ళూ ఒక్కలాగే ఉన్నారు. ఎటొచ్చీ



వాళ్ళు చదువులేని వాళ్ళు. మీరేమో మహా పండితుడు భుజంగుడి శిష్యులు,'' అని ఊరుకున్నాడు.

భుజంగుడు రాజధాని నుంచి తిరిగి వచ్చి, అకాలుడు ఇంకా అక్కడే ఉండడం చూసి ఆశ్చర్య పడ్డాడు. అతడు రాసిచ్చిన గ్రంథాల సారాన్ని చదివి, ''నాయనా, నువ్వు కారణజన్ముడివి. మహా పండితులకు కూడా సులభంగా అర్థంకాని గ్రంథాలను ఇట్టే అర్థం చేసుకున్నావు. సాందీపుడికి శ్రీకృష్ణుడిలా నువ్వు నాకు శిష్యుడుకావడం నా పూర్వ జన్మ సుకృతం,'' అన్నాడు పరమానందంతో.

ఆ మాటలకు అకాలుడు, ''గురువర్యా, తమరు నిజమే చెబుతున్నారా? లేక నన్ను వేళాకోళం చేస్తున్నారా?'' అన్నాడు అను మానంతో.

''నిజమే చెబుతున్నాను. సరైన సమయంలో నా దగ్గరికి వచ్చావు,'' అంటూ రాజధానిలో జరిగిన విశేషం చెప్పాడు:

రాజమాతకు ఉన్నట్టుండి జబ్బు చేసింది. రోగ లక్షణాలు రాజవైద్యుల శాస్త్రజ్ఞానానికి అందలేదు. అప్పుడు రాజాస్థానకవి తన దగ్గరున్న ఒక ప్రాచీన కావ్యం గురించి చెప్పాడు. అందులో కథానాయికకు, రాజమాతకు వచ్చిన జబ్బే వచ్చింది. వైద్యులు జబ్బుకు మందు చెప్పి మూడు మాసాలు గడువిచ్చారు. కథానాయకుడు ఎంతో శ్రమపడి ఆ మందు తెచ్చి కథానాయికను బతికించాడు. అయితే, కవులు, పండితులు, వైద్యులు ఎంత చదివినా ఆ కావ్యంలో నిక్షిప్తమై వున్న మందు వివరాలు తెలుసుకోలేక పోయారు. రాజు భుజంగుడికి కబురు పంపాడు. ఆయనకూ అందులోని వివరాలు అంతుబట్టలేదు. గురుకులానికి తిరిగి వెళ్ళి, అధ్యయనం చేసి వస్తానని చెప్పి, ఆ కావ్యం తీసుకుని వచ్చాడు. ఇప్పుడు అకాలుడి ప్రతిభ చూశాక ఆయనకు ధైర్యం వచ్చింది.

అకాలుడు ఆయన తెచ్చిన కావ్యం చదివి, ''గురువర్యా, ఇందులో ప్రతి పద్యానికీ సంగీత, సాహిత్య, నాట్య, వైద్య శాస్త్రాలకు సంబంధించిన విడి విడి అర్థాలున్నాయి. అందుకే మీరు కాస్త తడబడ్డారు. మందుకు సంబంధించినపద్యంలోచెప్పినదినుసులతో కషాయం చేసి రాజమాతకు ఇవ్వాలి. అదే సమయంలో పద్యాన్ని అందులో వివరించిన రాగతాళాలతో పాడుతూ దానికి అనుగుణంగా నాట్యం

చేస్తూ రాజమాతకు కనిపించాలి,'' అన్నాడు ఉత్సాహంగా.

భుజంగుడు కూడా మరొకసారి ఆ పద్యం చదివి అతడు చెప్పింది నిజమే అని గ్రహించి, మెచ్చుకున్నాడు. పద్యంలో చెప్పిన దినుసులను మరొకసారి చదివి, ''ఈ దినుసులన్నీ మా అనగరంలో పండిస్తారు,'' అన్నాడు అకాలుడు ఆశ్చర్యంగా.

మరునాడే భుజంగుడు, అకాలుడు కలిసి రాజధానికి వెళ్ళారు. రాజు భటులను పంపి అనగరం నుంచి మందుకు కావలసిన దినుసులన్నీ హెచ్చు ధర ఇచ్చి తెప్పించాడు. అకాలుడు వివరించిన పద్ధతిలో వైద్యం చేయడంతో, రాజమాతకు జబ్బు త్వరలో నయమయింది. రాజు అకాలుణ్ణి ఘనంగా సత్కరించాడు.

ఆ తరవాత అకాలుడు భుజంగుడి గురుకులానికి వెళ్ళి, రెండు సంవత్సరాల పాటు సకల శాస్త్రాలూ గురు ముఖాన అభ్యసించాడు. అతడు దేశమంతా తిరిగి సంగీత సాహిత్యాల్లో ప్రదర్శనలిస్తే ప్రజలు బ్రహ్మరథం పట్టారు.

అలా మరో రెండేళ్ళకు అతడు తన స్వస్థలమైన అనగరానికి వెళ్ళాడు. అతడి ప్రదర్శనలయ్యాక, వచ్చింది తమ ఊరి అకాలుడని తెలుసుకుని ఊరి పెద్దలు అతణ్ణి కలిసి, ''అప్పటికీ ఇప్పటికీ నువ్వేం మారలేదురా. ఇంత పేరురావడం నీ అదృష్టం,'' అన్నారు.

అకాలుడు సాలోచనగా, ''నన్ను మారలేదంటే, మీరు మారలేదని అర్థం. మిమ్మల్ని మార్చడం కోసం నేను ఇక్కడే ఉండిపోతాను,'' అన్నాడు.



అకాలుడికి మళ్ళీ పాత జీవితం మొదల యింది. వాడి మాటలనూ, చేతలనూ గ్రామ స్థులు ఎగతాళి చేస్తూనే ఉన్నారు. అయితే, వాడిప్పుడు వాటిని పట్టించుకోవడం లేదు. ఆసక్తికరమైన మాటలతో, కమ్మని కథలతో పిల్లలను ఆకర్షిస్తూ, తాను చదివిన వాటిని వారికి బోధించడం మొదలు పెట్టాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, తన గ్రామస్థుల హేళన భరించలేక తండ్రి వారి స్తున్నా వినకుండా పంతంతో ఊరు వదిలి వెళ్ళిన అకాలుడు, తిరిగి వచ్చి అదే ఊళ్ళో, అవహేళనల మధ్య గడపాలని ఎందుకు నిర్ణయించాడు? అతనిలోని సున్నితత్వాన్ని దేశసంచారం మోటుబారేలా చేసిందా? ఊరి వారిని మారుస్తానని వెళ్ళిన అకాలుడు తనే ఎందుకు మారిపోయాడు? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''తమ సమర్థత పట్ల నమ్మకం లేనప్పుడే ఎవరైనా సరే ఎదుటి వారి మెప్పుకోసం ఎదురు చూస్తారు. హేళన లకు జడుసుకుంటారు. ఎగతాళికి చిన్న బుచ్చుకుంటారు. అయితే, తమ ప్రతిభను గొప్పవాళ్ళు గుర్తించి మెచ్చుకున్న తరవాత మిగతావారి అభిప్రాయాలను పట్టించుకోరు. అకాలుడు తన తెలివితేటలకు గుర్తింపు రానప్పుడు తనను ఎగతాళి చేసిన వారిని చూసి చిన్నబుచ్చుకునేవాడు. అతడి ప్రతి భను పెద్దలు గుర్తించాక ఆ దశను అధిగ మించాడు. పెద్దల మెప్పు పొందిన తనను ఇంకా ఎగతాళి చేస్తున్న తన గ్రామస్థుల పట్ల అతనికి జాలి తప్ప, కోపం ఏ కోశానా లేదు. ఇక గ్రామస్థులలో మార్పు తీసుకురావాలన్న అతడి లక్ష్యంలో మాత్రం ఎలాంటి మార్పూ రాలేదు. పెద్దలను మార్చడం కన్నా, పిల్లలను ఉత్తములుగా తీర్చిదిద్దడం సులభం, అవ సరం అని గ్రహించడం వల్లే, అతడు వాళ్ళను చేరబిలిచి వాళ్ళకు అవసరమైన విషయాలను ఆసక్తికరమైన కథల రూపంలో బోధించడం ప్రారంభించాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. - (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]






# వారసత్వ భవనంలోని జాతీయ గ్రంథాలయం



మనదేశంలో నాలుగు జాతీయ గ్రంథాలయాలు ఉన్నాయి. 1954వ సం. పబ్లిక్ లైబ్రరీ చట్టం ప్రకారం మన దేశంలో ప్రచురించే పుస్తకాలు, పత్రికలు ఒకటి రెండు ప్రతులు విధిగా వీటికి పంపాలి. చెన్నయ్ నగరంలోని కన్నిమేరా పబ్లిక్ లైబ్రరీ ఆ నాలుగు జాతీయ గ్రంథాలయాలలో ఒకటి. ఎగ్మూరులోని మ్యూజియం థియేటర్ ప్రాంగణంలోని ఒక వారసత్వ భవనంలో ఈ గ్రంథాలయం ఉంది.

ఈ భవన నిర్మాణం 1890 మార్చి 23వ తేదీ ఆరంభమయింది. ఆనాటి మద్రాసు గవర్నర్ లార్డ్ కన్నిమేరా శంకుస్థాపన చేశారు. 1896 డిసెంబర్ 5వ తేదీ గవర్నర్ ఆర్థర్ ఎలిబ్యాంక్ హేవ్లాక్ గ్రంథాలయాన్ని ప్రారంభించారు. ఇండో-శారాశానిక్‌శైలిలో నిర్మించబడిన 110 సం.ల నాటి ఈ భవనంలో ఇటీవల ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, చెన్నయ్ సర్కిల్ తరఫున పునర్నిర్మాణం పనులు జరిగాయి.

ఈ భవనం ప్రత్యేక ఆకర్షణలలో ఒకటైన పొడవాటి హాలు, చదువుకునే గదిగా రూపొందించబడింది. రెండు వైపులా పుస్తకాల షెల్ఫ్‌లు అమర్చబడ్డాయి. విలువంపుగా ఉన్న పైకప్పులో అద్దాలు అమర్చి వీలైనంత సహజమైన వెలుతురు వచ్చేలా ఏర్పాటు చేయబడివుంది. అద్దాలు అమర్చిన పై కప్పులలో అందమైన చిత్రాలు చిత్రించబడ్డాయి. విలువంపుగా ఉన్న పైకప్పుకు ఇరువైపులా అమర్చిన రంగుటద్దాలు, నున్నటి స్తంభాలు, తోరణాలు, బర్మా టేకుతో తయారుచేయబడిన పిట్టగోడలను మరికొన్ని ఆకర్షణలుగా చెప్పుకోవచ్చు. ఇటీవల దీనికి అనుబంధంగా నూతన భవనం నిర్మించి గ్రంథాలయాన్ని విస్తరించారు.




# కుమాంత్రికుడు

అవంతిరాజ్యం నందివరంలో నివసిస్తూన్న ప్రజ్వలుడు బాల్యం నుంచే పరోపకారబుద్ధి కలవాడు. యుక్త వయస్కుడయ్యే సరికి అతడిలో అన్యాయాలను ఎదుర్కొనేస్వభావం కూడా దృఢపడింది.

అదే ఊళ్ళో కేశవుడనే పేదరైతు చావు బతుకుల్లో ఉన్న తన భార్య వైద్యం కోసం తనకున్న కొద్దిపాటి పొలాన్ని ఫణిరాజు అనే ధనవంతుడికి అమ్మాడు. ఫణిరాజు రైతుకు సగం డబ్బిచ్చి, మిగిలినది తరవాత ఇస్తానన్నాడు. వారం తరవాత కేశవుడు తనకు రావలసిన డబ్బు అడగడానికి ఫణిరాజు ఇంటికి వెళ్ళాడు. ఫణిరాజు డబ్బు ఇవ్వకపోగా, కేశవుడి మీద దొంగతనం నేరం మోపి, రక్షక భటులకు అప్పగించాడు. కేశవుడు ఎంత మొత్తుకున్నా వినిపించుకోకుండా కొత్వాలు అతన్ని కారాగారానికి పంపాడు.

ఇది అన్యాయం అని తెలిసినప్పటికీ, కొత్వాలుకు భయపడి గ్రామస్థులెవరూ నోరు మెదపలేక పోయారు. అయితే, ప్రజ్వలుడు దీన్ని చూస్తూ సహించలేక కొత్వాలు వద్దకు వెళ్ళి అసలు సంగతి చెప్పాడు. అయితే, కొత్వాలు ఫణిరాజుకు కావలసినవాడు గనక, ప్రజ్వలుడి మాటను వినిపించుకోలేదు. ఎంత చెప్పినప్పటికీ కేశవుణ్ణి వదిలి పెట్టక పోవడంతో, ప్రజ్వలుడు రెచ్చిపోయి ఎదురు తిరిగాడు. కొత్వాలు అతన్ని బంధించమని భటులను ఆజ్ఞాపించాడు. అయితే, ప్రజ్వలుడు వాళ్ళకు పట్టుబడకుండా తప్పించుకుని పారిపోయి, ఒక కొండ ప్రాంతంలోని గుహలోకి జొరబడ్డాడు.

గుహకు ఆవలివైపున దట్టమైన అరణ్యం ఉంది. అరణ్యంలో చాలా దూరం నడిచిన ప్రజ్వలుడు బాగా అలిసిపోవడంతో ఒక చెట్టునీడలో చతికిలబడి, కొంతసేపటికి అలాగే నిద్రపోయాడు.

చాలా సేపయ్యాక ముఖం మీద నీటి బిందువులు పడడంతో, ప్రజ్వలుడు కళ్ళు

గుండ్రాతి సుబ్రహ్మణ్యంగౌడు

తెరిచాడు. ఎదురుగా దండ కమండలాలతో మందహాసం చేస్తూ దివ్యతేజస్సుతో నిలబడ్డ ఒక వృద్ధ ముని, ''దుష్టమృగాలు తిరిగే ఈ అరణ్యంలోకి ఎందుకు వచ్చావు నాయనా?'' అని అడిగాడు.

''వాటికన్నా భయంకర స్వభావులైన అధికారగణం నుంచి తప్పించుకోవడానికి ఇక్కడికి వచ్చాను మహాత్మా,'' అంటూ నెమ్మదిగా లేచి కూర్చున్న ప్రజ్వలుడు జరిగినదంతా మునికి వివరించాడు.

అంతా విన్న ముని తలపంకిస్తూ, ''అవును, అవంతిరాజు హేమాంగదుడి అలసత్వం వల్లే అధికారులిలా ప్రజలను వేధిస్తున్నారని నేనూ విన్నాను,'' అన్నాడు.

''ఇలాంటి దుర్మార్గులను శిక్షించే మార్గమే లేదా?'' అని అడిగాడు ప్రజ్వలుడు బాధ, ఆవేశం నిండిన కంఠస్వరంతో.

''నీలాంటి ధర్మావేశం గల సమర్థుడైన యువకుడికోసమే ఇన్నాళ్ళుగా ఎదురు చూస్తున్నాను,'' అన్నాడు ముని.

ఆ తరవాత ఆయన దాపులనున్న చెట్టు నుంచి, వింత ఆకారంగల ఒక కర్రను విరిచి, కళ్ళు మూసుకుని కొంత సేపు మంత్రం జపిస్తూ నొసటికి ఆనించాడు. ఆ పిమ్మట దాన్ని ప్రజ్వలుడికి ఇస్తూ, ''నాయనా, ఈ మంత్రదండం సాయంతో నువ్వు అదృశ్యంగా సంచరించవచ్చు. వాయువేగంతో పయనించవచ్చు. శత్రువులను నిర్వీర్యం చేసి అంగుష్ఠ ప్రమాణులుగా మార్చవచ్చు. తరవాత వారిని కావాలనుకున్నప్పుడు మామూలు మనుషులుగా చేయవచ్చు. అయితే, ఇది నీకు



మాత్రమే, అదీ దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించి మంచిపనులు చేయడానికి మాత్రమే ఉపయోగపడుతుంది. విజయోస్తు!'' అని ఆశీర్వదించాడు.

ప్రజ్వలుడు ఆ మంత్రదండాన్ని ఆనందంతో అందుకుని, భక్తితో కళ్ళకద్దుకుని, మునికి సాష్టాంగ నమస్కారం చేసి అక్కడి నుంచి బయలుదేరాడు. ఇతరులు తనను గుర్తుపట్టకుండా–రాగిరంగు జుట్టు, పొడవాటి ముక్కు, నిప్పుకణికల్లా కళ్ళూ, పెదవి దాటిన దంతాలూ మోకాళ్ళ వరకు నల్లటి అంగీగల యువకుడి రూపం ధరించాడు. ఆ తరవాత నందివరానికి తిరుగు ప్రయాణమై వస్తూండగా మార్గ మధ్యంలో ఒక గ్రామం నడివీధిలో ఒక యువతి, ''రక్షించండి, రక్షించండి!'' అని కేకలు పెడుతూ పరిగెత్తడం



చూసి ఆగాడు. గున్న ఏనుగులా ఉన్న ఒక మధ్యవయస్కుడు, పదిమంది బలాఢ్యులను తోడు తీసుకుని ఆమె వెంటబడి తరుముతున్నాడు. గ్రామస్థులు భయం భయంగా ఆ దృశ్యంకేసి చూస్తున్నారే తప్ప ఒక్కరూ అడ్డుకోలేదు.

''ఆగు,'' అంటూ ప్రజ్వలుడు దారికి అడ్డంగా వెళ్ళాడు.

అమితాగ్రహం చెందిన ఆ మధ్య వయస్కుడు, ''నాకు అడ్డురాగల ధీరుడివి, ఎవడివిరా నువ్వు?'' అని అడిగాడు.

''చట్టాన్ని!'' అన్నాడు ప్రజ్వలుడు.

''ఇన్నాళ్ళు ఎక్కడున్నావు? నన్ను ఏ చట్టాలూ ఏమీ చేయలేవు. నేను ఈ గ్రామాధికారి నాగస్వరాన్ని. నాకు కావలసిన యువతిని వివాహమాడగలను. నన్ను అడ్డుకునే మగధీరుడు ఇంకా పుట్టలేదు,'' అని హుంకరించాడు గ్రామాధికారి.

''ఇంతకు ముందు ఇష్టపడని యువతులను బలవంతంగా వివాహమాడినందుకు ఐదు సంవత్సరాలు, ఇప్పుడీ యువతిని పెళ్ళాడమని బలాత్కరించినందుకు ఒక సంవత్సరం వెరసి, ఈ దేశపు చట్టం ప్రకారం నీకు ఆరు సంవత్సరాలు కఠిన కారాగార శిక్ష విధిస్తున్నాను,'' అన్నాడు ప్రజ్వలుడు గంభీరంగా.

నాగస్వరానికి ఆగ్రహం కట్టలు తెంచుకున్నది. ''ఈ కుర్రకుంక నాకు శిక్ష విధించగలిగినంతవాడా? వాణ్ణి పట్టి చెట్టుకు కట్టి చావగొట్టండి,'' అని అరిచాడు.

ప్రజ్వలుడు దుస్తుల్లో దాచిన మంత్రదండాన్ని తీసి వాళ్ళకేసి చూపాడు. దాని నుంచి నీలి కిరణాలు ప్రసరించడంతో నాగస్వరం, వాడి అనుచరులు బొటనవేలంతగా మారిపోయారు. ప్రజ్వలుడు వాళ్ళను పట్టి చిన్న బుట్టలో వేసుకుని, నాలుగడుగులు వెనక్కు వేసి, అదృశ్యమైపోయాడు.

ఆ వింత దృశ్యం చూసి జనం నిశ్చేష్టులైపోయారు.

ఆ తరవాత మరికొన్ని క్షణాల్లో ప్రజ్వలుడు నందివరంలోని కొత్వాలు ఎదుట ప్రత్యక్షమయ్యాడు. ఆ సమయంలో ఫణిరాజు కూడా అక్కడే ఉన్నాడు. 'కేశవుడికి రావలసిన డబ్బు ఇవ్వక పోగా, అతన్ని ఖైదు చేయడం దురన్యాయం. వెంటనే అతన్ని వదిలిపెట్టి, అతనికి చెందవలసిన డబ్బిచ్చి పంపండి,'' అన్నాడు ప్రజ్వలుడు.

''మాకు న్యాయాన్యాయాల గురించి చెప్పడానికి నువ్వెవడివి? నోరు మూసుకుని వెళ్ళు. అనవసరంగా తలదూర్చావంటే నువ్వూ కటకటాల పాలుకాలగవు!'' అన్నాడు కొత్వాలు కోపంగా.

వెంటనే ప్రజ్వలుడు కొత్వాలునూ, ఫణిరాజునూ బొటన వేలంతవాళ్ళుగా మార్చి, బుట్టలో వేసుకున్నాడు. క్షణాలలో కేశవుణ్ణి ఖైదు నుంచి విడిపించి అందరూ దిగ్భ్రాంతులై చూస్తూండగా అక్కడి నుంచి అదృశ్యమయ్యాడు!

ఆ రోజునుంచి ప్రజ్వలుడు అదృశ్యంగా సంచరిస్తూ-అమాయకులనూ, బలహీనులనూ పీడించే దుర్మార్గులను కనిపెట్టి పట్టుకురాసాగాడు. అలా పట్టుకు వచ్చినవారిని ఇనుప పంజరాలలో బంధించేవాడు.



ప్రజ్వలుణ్ణి గురించి రాజ్యంలో రకరకాల వదంతులు వ్యాపించాయి. క్షుద్ర మాంత్రికుడు నేరస్థుల్ని పట్టుకెళ్ళి చీకటి గుహలో బంధించి చిత్రహింసలు పెడుతున్నాడని కొందరూ; ఏదో వింతశక్తి క్షుద్రమాంత్రికుడి రూపంలో చట్టబద్ధంగా శిక్షలు అమలు చేస్తున్నదని మరి కొందరూ అనుకోసాగారు. సామాన్య ప్రజలకు బాధలు తగ్గాయని అందరూ సంతోషంగా చెప్పుకోసాగారు. బలహీనులను పీడించాలనుకునే పెత్తందార్లకు కంటి మీద కునుకు కరువయింది. వాళ్ళందరూ రాజు వద్దకు వెళ్ళి తమ గోడు విన్నవించుకున్నారు.

రాజు మహామంత్రిని పిలిచి మంతనాలు జరిపాడు.

మరునాడు రాజు సభను ఏర్పాటు చేసి, మంత్రులు, దండనాధులు, రాజోద్యోగుల సమక్షంలో క్షుద్రమాంత్రికుడి చర్యలను వివరించి, ''ఆ క్షుద్ర మాంత్రికుడు చేస్తున్నది మంచిదా, కాదా అన్నది ఇప్పుడు అప్రస్తుతం. వాడు మనకు పోటీగా తయారయ్యాడన్నది సుస్పష్టం. ఒక రాజ్యంలో రెండు అధికారకేంద్రాలు ప్రమాదకరం గనక, వాణ్ణి నిర్మూలించే మార్గం చూడాలి,'' అన్నాడు.

ఆ మాట వినగానే మహామంత్రి భయంతో వణుకుతూ లేచి నిలబడి, ''మహా ప్రభూ, ముందు నన్ను ఖైదులో ఉంచండి,'' అని వేడుకున్నాడు.

''తమరెందుకు ఖైదులో ఉంచడం మహామాత్యా?'' అని అడిగాడు రాజు ఆశ్చర్యంగా.

''తమకు తెలియకుండా నేను ప్రజలను

వేధించే కొన్ని అపరాధాలు చేశాను. ఆ క్షుద్ర మాంత్రికుడికి చిక్కి, వాడి చేత చిత్రహింసలు అనుభవించడం కన్నా, తమ బందిఖానాలో శిక్షఅనుభవించడమే మేలని భావిస్తున్నాను,'' అన్నాడు మహామంత్రి దీనస్వరంతో.

మహారాజు అందుకు అయిష్టంగానే అంగీకరించి, మహామంత్రి నేరాన్ని విచారించి చట్ట ప్రకారం తగిన శిక్ష విధించాడు.

ఆ తరవాత రాజుగారి కొలువులో ఉన్న మరికొందరు స్వచ్ఛందంగా తప్పులు ఒప్పుకుని లొంగిపోయారు. క్షుద్ర మాంత్రికుడికి భయపడి, నేరాలకు పాల్పడ్డ వారందరూ రాజుకు లొంగిపోయారన్న వార్త రాజ్యమంతటా వ్యాపించడంతో ప్రజలలో సైతం నేరప్రవృత్తి బాగా తగ్గిపోయింది. క్రమంగా రాజ్యంలో నేరస్థులే కరువయ్యారు. ప్రజ్వలుడు ఒక్కరిని కూడా పట్టుకువెళ్ళలేని మంచి పరిస్థితి ఏర్పడింది. దాంతో ప్రజ్వలుణ్ణి గురించి ప్రజలు అబ్బురంగా మాట్లాడుకోవడం కూడా ఆగిపోయింది.

ఒకనాటి సాయంకాలం మహామంత్రితో కలిసి ఉద్యాన వనానికి వాహ్యాళికి వెళ్ళిన మహారాజు, ''తమ సలహా చక్కగా పని చేసింది మంత్రివర్యా. ప్రజలిప్పుడు ప్రశాంతంగా జీవిస్తున్నారు,'' అంటూ మంత్రిని అభినందించాడు.

''అభినందించవలసింది నన్ను కాదు. క్షుద్ర మాంత్రికుడని ప్రజలు చెప్పుకుంటూన్న ఆ యువకుణ్ణి,'' అన్నాడు మంత్రి.

ఏమిటి అన్నట్టు చూశాడు రాజు.

''అవును మహారాజా, ఒకనాడు ఆ యువకుడు నా వద్దకు వచ్చి తను చేస్తూన్న పనిని గురించి చెప్పి, పంజరాలలో బంధించిన నేరస్థులను నాకు చూపాడు. మనం చేయవలసిన పనిని అతడు చేస్తున్నాడని మొదట ఎంతగానో సంతోషించినప్పటికీ, ఆ తరవాత నేరస్థుల పట్ల ఉపేక్ష తగదని గ్రహించాను. ఎవరైనా సరే భయం ఉంటేనే దుష్టకార్యాలకు దూరంగా ఉండగలరని భావించి, నేరస్థులు స్వచ్ఛందంగా లొంగిపోయే ఉపాయం ఆలోచించాను. దోషిగా నటించాను,'' అన్నాడు మంత్రి.

అలాగా అన్నట్టు రాజు మందహాసంతో తలపంకించాడు.



# చందమామ ఇండియా క్విజ్ - 3

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

ఈ నెల క్విజ్ స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించినది.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి), పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ ఇండియా క్విజ్- 3 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. ఏప్రిల్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. జూన్ 2007 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. పక్కన ఉన్న చిత్రాలను చూసి ఆ స్వాతంత్ర్యోద్యమ నాయకుల పేర్లేమిటో చెప్పగలరా? వారు ఏ పేర్లతో సుప్రసిద్ధులు?
2. బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా పోరాడిన రాజకీయ పార్టీని స్థాపించింది ఒక బ్రిటిష్ మాజీ అధికారి. ఆయన పేరేమిటో చెప్పగలరా?
3. న్యాయస్థానంలో విచారణ జరుగుతూండగా బాల గంగాధర తిలక్ నోటి నుంచి వెలువడిన ఒక మాట ఆ తరవాత ఒక నినాదంగా రూపొందింది. ఆ నినాదం ఏది?
4. 1929లో జరిగిన కాంగ్రెస్ మహా సభలో ఒక చారిత్రాత్మకమైన తీర్మానం నెరవేర్చబడింది. ఆ సమావేశం ఎక్కడ జరిగింది? దానికి అధ్యక్షత వహించిన వారెవరు? తీర్మానం ఏది?
5. భారత జాతీయ కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించిన తొలి మహిళ ఎవరు? ఎప్పుడు?




# ప్రథమ తాంబూలం

స్కందషష్ఠి ఉత్సవానికి ఆ ఊళ్ళో రకరకాల దుకాణాలతో పెద్ద సంత ఏర్పాటయింది. రామేశం, కామేశం మరి నలుగురు గ్రామస్థులు కలిసి సంతకు బయలుదేరారు.

సంతమొదట్లో ఒకడు ఖర్జూరాలమ్ముతూ, ''ఇవి మామూలు ఖర్జూరాలు కావు. రుచి చూసే కొనండి,'' అంటున్నాడు.

రామేశం వాణ్ణి సమీపించ బోతూండగా కామేశం ఆపి, ''ఎక్కడైనా సరే ప్రథమ తాంబూలం నాకే,'' అంటూ ముందుకు వెళ్ళి పండు రుచి చూసి, ''నేను మెచ్చి కొన్నానంటే నీ సరుకంతా క్షణాల మీద అమ్ముడైపోతుంది. నాకు రెండు వీశల పళ్ళు తూకం వెయ్యి,'' అన్నాడు.

మిగతా వాళ్ళు కూడా అక్కడ పళ్ళు కొన్నారు. నిమిషాలలో ఈ సంగతి మిగతా దుకాణాదారులకు తెలియడంతో, ఏ దుకాణం ముందు ఆగినా కామేశానికే ప్రథమ తాంబూలమివ్వసాగారు.

అలా వాళ్ళు కొన్ని దుకాణాలు దాటి ముందుకు వెళితే ఒకడు అందమైన పాలరాతి బొమ్మలు అమ్ముతూ కనిపించాడు. వాడు ధర చాలా ఎక్కువ చెబుతున్నాడని కామేశం ముందడుగు వేయడానికి తటపటాయించాడు. రామేశం ముందుకు వెళ్ళి, ''ఈ ఊళ్ళో ఇంత ధరపెట్టి వీటిని కొనేవాళ్ళుండరు. ఇచ్చేధర చెప్పు,'' అన్నాడు.

''ఇవి మామూలు బొమ్మలు కావు! తాజమహల్ కట్టిన పాలరాతితో చేసిన బొమ్మలు. పెద్ద బొమ్మ వరహా కొక్కటి. చిన్నవి వరహాకి మూడు. మీరు అడిగారు కాబట్టి, పెద్దబొమ్మ ఒకటి కొంటే చిన్నబొమ్మ ఒకటి ఉచితంగా ఇస్తాను,'' అన్నాడు బొమ్మలమ్మేవాడు.

''పెద్దవి రెండు కొంటాను. మూడు చిన్న బొమ్మలు ఉచితంగా ఇవ్వు,'' అన్నాడు రామేశం. బొమ్మలమ్మేవాడు ఒప్పుకున్నాడు. మిగతావాళ్ళు వెనక్కు తగ్గి, ''ఇలాంటి బొమ్మలు కొనాలంటే కళల పట్ల ఆసక్తి

ఉండాలి. ఏమంటావ్ కామేశం,'' అన్నారు కామేశంతో.

ఆ మాట విన్న రామేశం, ''వీళ్ళు ఇలా అంటున్నారేమిటీ! నీకు కళలంటే చాలా అభిమానమనీ, ఇలాంటి బొమ్మలు కొని కళాకారులను పోషించడం నీకు ఇష్టం గనక, ఇక్కడా ప్రథమ తాంబూలం నీకే దక్కాలను కున్నానే,'' అన్నాడు ఆశ్చర్యంగా కామేశాన్ని చూస్తూ. రామేశం మాటలకు పొంగిపోయిన కామేశం, ''నా గురించి వీళ్ళకు తెలియదు కానీ, ప్రథమ తాంబూలం నాకే దక్కాలన్న నీ మాట మీద గౌరవంతోనైనా, ఇక్కడ నేనొక బొమ్మ కొంటాను,'' అంటూ ముందుకు వచ్చి, ఒక పెద్దబొమ్మ తీసుకుని బొమ్మలమ్మే వాడికి ఒక వరహా ఇచ్చాడు.

రామేశం బొమ్మలమ్మేవాడితో, ''మేమిద్దరం ఒకటేలే, రెండు బొమ్మలు తీసుకుంటాం,'' అంటూ వాడికి మరో వరహా ఇచ్చాడు. బొమ్మలమ్మేవాడు ఆయనకు బొమ్మతో పాటు మూడు చిన్న బొమ్మలు ఉచితంగా ఇచ్చాడు.

వెలుపలికి వచ్చాక రామేశం కామేశానికి మూడు చిన్న బొమ్మలు చూపించి, ''రెండు పెద్ద బొమ్మలు కొన్నందుకు ఇవి ఉచితంగా వచ్చాయి. వీటిలో ఒకటి తీసుకో. మిగతా రెండూ నావి,'' అన్నాడు.

''న్యాయంగా పంచుకుంటే ఇద్దరికీ చెరో ఒకటిన్నర బొమ్మరావాలి. బొమ్మను విరగ్గొట్టలేం కాబట్టి, అరబొమ్మకు ధరకట్టి నాకివ్వడం ధర్మం. లేదూ, బేరమాడి పెట్టినందుకు అర బొమ్మ ధర నీకు కూలీగా ఇచ్చాననుకుంటాను,'' అన్నాడు కామేశం అసంతృప్తిగా.

''బేరమాడినందుకు నీ దగ్గర కూలి తీసు కుంటానని ఎలాగనుకున్నావు? బొమ్మలమ్మే వాడు ఒక పెద్ద బొమ్మకొంటే ఒక చిన్న బొమ్మ ఉచితం అన్నాడు. రెండు పెద్దబొమ్మలు కొంటే మూడు చిన్న బొమ్మలు ఉచితం అన్నాడు. అంటే, మొదటి బొమ్మకు ఒక చిన్న బొమ్మ, రెండో బొమ్మకు రెండు చిన్న బొమ్మలు ఉచితం. నీకేమో ప్రథమ తాంబూలం మన సాయె. మరి మొదటి బొమ్మకు ఉచితంగా వచ్చింది ఒక్క చిన్న బొమ్మే కదా?'' అన్నాడు రామేశం చిన్నగా నవ్వుతూ. ఇది వింటూనే మిగతావాళ్ళు ఫక్కున నవ్వారు. కామేశం, రామేశం చేతిలో మరోసారి భంగపడ్డాడు.



మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (16)

# అమిత బలశాలి–అత్యంత బలహీనుడు!

క్రీ.శ. ఒకటవ శతాబ్దంలో చక్రవర్తి టైటస్ రోమ్ సామ్రాజ్యాన్ని కొన్నేళ్ళు పరిపాలించాడు. ఆయన తండ్రి చక్రవర్తి వెస్పాసియన్‌పరిపాలనా కాలంలో యువకుడైన టైటస్ రోమ్ సామ్రాజ్య సేనాధిపతిగా సాటిలేని తన శక్తిసామర్థ్యాలను నిరూపించుకున్నాడు.

యూదుల సుప్రసిద్ధ నగరమైన జెరూసలెంను ఆయనే జయించాడు. ఆనాటిపాలకులు మరీ క్రూరులుగా ఉండేవారు. ఉదాహరణకు టైటస్ అనంతరం రోమ్ సింహాసనాన్ని అధిష్ఠించిన ఆయన తమ్ముడు డిమీటియన్ క్రూర స్వభావం గురించే చెప్పవచ్చు. తనకు నచ్చని, తనను హేళన చేసేదిగా ఉన్నదని తాను భావించిన ఒక హాస్యోక్తిని తన సమక్షంలో చెప్పిన ఒక వ్యక్తిని అతడు స్తంభానికి కట్టించి, వేటకుక్కల చేత కరిపించి ముక్కలు చెక్కలు చేయించాడు!

ఆ కాలఘట్టంలోని అధికార దురహంకారులతో పోల్చినప్పుడు టైటస్‌ను సౌమ్యస్వభావుడనే చెప్పాలి. అయినప్పటికీ, అతి పెద్దదీ, బలీయమైనదీ అయిన రోమను సైన్యానికి తాము ఏవిధంగానూ సాటికాలేమని బాగా తెలిసి వుండీ, తమ నగరాన్ని రక్షించుకోవడానికి తమ ప్రాణాలర్పించి వీరోచితంగా పోరాడిన యూదులను జయించిన క్షణం నుంచీ ఆయనలో సైతం అహంకారం పెరగసాగింది.

జెరూసలెం నుంచి జయప్రదంగా రోమ్‌కు తిరిగి వచ్చిన శుభసందర్భాన్ని పురస్కరించుకుని ఆయన గౌరవార్థం ఒక ద్వారతోరణం నిర్మించబడింది. 'ఆర్చ్ ఆఫ్ టైటస్' అనే దాని అవశేషం ఈనాటికీ నిలిచి ఉన్నది. ఆయన పాలనాకాలంలో ఆ 'ఆర్చ్' చాలా గొప్పగా ఉండేది. టైటస్ ఆ ద్వారతోరణం కేసి వెళ్ళినప్పుడల్లా ఆయన మిత్రులు ఆయన సాధించిన ఘన విజయాన్ని కీర్తిస్తూ అమితంగా పొగిడేవారు; పాటలు పాడేవారు.

వాళ్ళ పొగడ్తలకు పొంగిపోయిన టైటస్ ఒకనాడు, ''యూదులు వాళ్ళ దేవుడి తరపున పోరాడారు. వాళ్ళను ఓడించడం ద్వారా యూదుల దేవుడికన్నా నేనే శక్తిమంతుడినని



రుజువయింది కదా!'' అన్నాడట ఆనందాతిశయంతో.

ఆ మాట విని సభాసదులు ఆయన చతురోక్తిని, 'ఆహా! ఓహో,' అంటూ మెచ్చుకున్నారు. అయితే, ఒక వింత కంఠస్వరం మాత్రం భిన్నంగా వినిపించింది. ''అతి బలహీనమైన ప్రాణి కూడా అత్యంత బలవంతమైన దానిని హతమార్చగలదు: అతి చిన్న ప్రాణి కూడా అతి పెద్ద ప్రాణిని నాశపరచగలదు. పరిస్థితుల ప్రభావం ముందు మనిషి నిస్సహాయుడు!'' అన్నది ఆ కంఠస్వరం.

అన్నాళ్ళు సహనశీలిగా భావించబడిన టైటస్ హఠాత్తుగా కోపోద్రిక్తుడై, ''ఎవరా మాట అన్నది?'' అని ప్రశ్నించాడు బిగ్గరగా.

మళ్ళీ అదే కంఠస్వరం వినిపించింది: ''మానవుడి శక్తిసామర్థ్యాలు, ఘన విజయాలు రెప్పపాటులో నీటి బుడగల్లా చిట్లి పోగలవు!''

సర్వత్రా నిశ్శబ్దం ఆవరించింది. అయినా ఆ మాట ఎవరన్నదీ తెలియలేదు. ఆ నిశ్శబ్దంతో పాటు సభలో కొంత భయంకూడా ఏర్పడింది. సభికులు పలువురు దాన్ని అమానుష శక్తి హెచ్చరికగానే భావించారు.

హఠాత్తుగా చోటు చేసుకున్న ఉద్రిక్త పరిస్థితిని పోగొట్టడానికి టైటస్ బిగ్గరగా నవ్వుతూ, ''పిరికిపందలే అలా భావిస్తారు!'' అన్నాడు హేళనగా. సభాసదులు రాజుకు వంతపాడుతూ మరింత బిగ్గరగా నవ్వసాగారు.

టైటస్ నవ్వుతూండగా ఒక చిన్న కీటకం ఆయన నోట్లోకి ప్రవేశించి ముక్కుద్వారంలో జొరబడింది. ఆయన నవ్వు ఉన్నట్టుండి ఆగిపోయిందిగాని, సభాసదులు జరిగిన విషయం తెలియక నవ్వుతూనే ఉన్నారు. చక్రవర్తి ముఖం బాధతో కుంచించుకు పోయింది. కీటకాన్ని వెలుపలికి తుమ్మడానికి ఎంతో ప్రయత్నించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. అల్ప కీటకం కారణంగా ఊపిరాడకుండా, మంచం పట్టిన చక్రవర్తి టైటస్ ఆ తరవాత కోలుకోనే లేదు! (ఎం.డి)

## చందమామ ఇండియా క్విజ్-1 (ఫిబ్రవరి 2007) సమాధానాలు

1. ఋశ్యశృంగుడు. ఆయన అడుగు పెట్టిన చోట వర్షం కురుస్తుంది.
2. ఒక నది పేరు. రామాయణంలో ప్రస్తావించబడింది.
3. శ్రీ కృష్ణుడు తన గురువు సాందీపుని కుమారుడు పునర్దత్తుని అపహరించి సముద్ర గర్భం చేరిన పంచజనుడనే రాక్షసుణ్ణి సంహరించి గురుకుమారుణ్ణి రక్షించాడు. అప్పుడు వాడి కడుపులో ఉన్న పాంచజన్యమనే శంఖాన్ని కూడా తీసుకున్నాడు.
4. పారిజాత వృక్షం. స్వర్గంలో ఉంటుంది.
5. కృపి.
6. సరస్వతి.
7. దేవవ్రతుడు. తన తండ్రి వివాహం కోసం తాను వివాహమాడనని భీష్మ ప్రతిజ్ఞ చేసి భీష్ముడయ్యాడు.
8. అర్జునుడు. శత్రువుల గుండెల్లో భయం పుట్టించేవాడు.
9. సీత.

# చందమామ కబుర్లు

## స్పేస్‌వాక్ చేసిన సునీత





భారతీయ సంతతికి చెందిన అమెరికా మహిళా వ్యోమగామి సునీతా విలియమ్స్ 29 గంటలా 17 నిమిషాలు అంతరిక్షంలో నడిచి సరికొత్త రికార్డును సృష్టించింది. ఫిబ్రవరి 8వ తేదీ నాలగవ సారిగా కమాండర్ మైఖేల్ లోపెజ్ అల్జీరియాతో కలిసి అంతర్జాతీయ అంతరిక్ష కేంద్రం నుంచి అంతరిక్షంలోకి అడుగుపెట్టి 6 గంటలా 40 నిమిషాలు గడిపింది. వాళ్ళు అప్పుడు ఎలక్ట్రికల్ సిస్టాన్ని సరిచేశారు. అంతకు ముందు ఫిబ్రవరి 4వ తేదీ సునీ, మైఖేల్ ఇద్దరూ అమోనియా లీక్‌ను సరిచేస్తూ 7 గంటలు గడిపారు. ఆ ఇద్దరికీ అమోనియా పొరలు ఎలాంటి హానీ చేయలేదు. ఎలాంటి కలుషితం జరగలేదని పరీక్షల ద్వారా తెలియవచ్చింది.

## ఆహార పానీయాలు లేకుండా 5000 కి.మీ. పయనం!

దుర్గంధం వీచే స్కంక్ జంతువును మనుషులెవ్వరూ దగ్గరికి రానివ్వరు. ఉడత జాతికి చెందిన ఒక స్కంక్ ఇటీవల కాలిఫోర్నియా నుంచి 5000 కి.మీ. దూరం ఐదు రోజులపాటు ఏకబిగిన ప్రయాణం చేసింది. అది ఒక పెద్ద రబ్బర్ పైపులో పడుకుని నిద్రిస్తుండగా, దానిని గమనించక పనివాళ్ళు పైపును ఒక కంటైనర్‌లో వేసి మూసి బండిలోకి ఎక్కించారు. అక్కడి నుంచి కెనడాలో ఓట్టావా చేరేంతవరకు ఆ జంతువుకు ఆహార పానీయాలు లేవు. అధికారులు దానిని కెనడా అడవుల్లో దించలేక నానా తంటాలు పడ్డారు. అదృష్టవశాత్తు ఆఖరికి టోరొంటో వన్యమృగ కేంద్రం వాళ్ళు దాని బాధ్యతలు చేపట్టారు. వాళ్ళు 'ది విజార్డ్ ఆఫ్ ఓజ్' కథలో ఒక దేశంలో నిద్రపోయి మరో దేశంలో మేలుకునే 'డోరొతీ' పేరు దానికి పెట్టారు. ప్రయాణ సమయంలోగాని, ఆ తరవాత గాని అది దుర్గంధాన్ని వెలువరించలేదు.



## మహారాష్ట్ర జానపద కథ

# పాలరాతి భవనం

పడమటి కనుమల దిగువ లోయలోని సోమ నాథపూర్ అనే చిన్న రాజ్యాన్ని సాహస ప్రియు డైన రాజు సోమదేవుడు పరిపాలించే వాడు. ఆయన తన రాజ్యాన్ని సక్రమంగా పరిపాలిస్తూ ఇరుగుపొరుగు రాజ్యాలతో మైత్రీ సంబంధాలు కలిగి ఉండేవాడు. అందువల్ల ఆ రాజ్యంలోని ప్రజలు సుఖశాంతులతో జీవించసాగారు.

రాజుగారి ఏకైక సంతానం సోమరాజు. అతడు రాజోచిత విద్యలు నేర్చుకుని అంద మైన యువకుడిగా పెరిగాడు. యువరాజులో ఏవైనా సాహస కృత్యాలు చేయాలన్న కోరిక రోజు రోజుకూ బలపడసాగింది. ఒకనాడతడు తండ్రి వద్దకు వెళ్ళి, "నాన్నా, నేను ఒంటరిగా దేశాటన చేసి రావాలని ఆశిస్తున్నాను. అను మతించండి," అని వేడుకున్నాడు.

"ఒంటరిగా ఎందుకు వెళ్ళాలి? అంగ రక్షకులను వెంటబెట్టుకుని వెళ్ళు. లేదా నీతోపాటు ఒకరిద్దరు మిత్రులను తీసుకు వెళ్ళు. వాళ్ళు కూడా దేశాటన పట్ల ఆసక్తి కలవాళ్ళే కదా?" అన్నాడు తండ్రి అయిష్టంగా.

"వద్దు నాన్నా, ఎవరితోడూ వద్దు. నేను ఒంటరిగానే వెళ్ళి రావాలనుకుంటున్నాను," అన్నాడు సోమరాజు.

"అలా అయితే, అందుకు మొదట మీ తల్లిగారి అనుమతి పొందిరా," అన్నాడు రాజు.

యువరాజు తల్లి వద్దకు వెళ్ళి తన కోరిక చెప్పాడు.

"నువ్వు ఒంటరిగా వెళ్ళడం నాకు అంత సంతోషం కాదు గాని, దేశాటన సమయంలో ఎలాంటి చిక్కుల్లో పడకుండా క్షేమంగా తిరిగి రాగలనని నాకు మాట ఇచ్చే పక్షంలో నిరభ్యం తరంగా వెళ్ళిరా," అన్నది తల్లి.





యువరాజు సరేనని చెప్పి, తల్లి పాదాలకు నమస్కరించి తండ్రి వద్దకు తిరిగి వచ్చి సంగతి చెప్పాడు. ''ఎప్పుడు బయలుదేరాలనుకుంటు న్నావు?'' అని అడిగాడు రాజు.

''నూతన సంవత్సర శుభారంభం కదా, రేపే బయలు దేరుతాను,'' అన్నాడు యువరాజు.

మరునాడు సూర్యోదయమవుతూండగా యువరాజు తెల్లటి గుర్రాన్ని అధిరోహించి, అమితోత్సాహంతో బయలుదేరాడు. అతని వెంట వచ్చిన ఆరుగురు భటులు రాజ్యం సరి హద్దుల వరకు వచ్చి వెనుదిరిగి వెళ్ళిపోయారు. యువరాజు చుట్టుపక్కల పరిసరాలను పరి శీలనగా చూస్తూ ముందుకు సాగాడు.

పగలంతా ప్రయాణం చేస్తూ, ప్రకృతి అందా లను తిలకిస్తూ, సెలయేళ్ళలో స్నానం చేసి సేదదీరుతూ, ఫలవృక్షాలలోని పళ్ళను కోసి తింటూ, రాత్రుల్లో విశ్రాంతి తీసుకుంటూ యువరాజు కొన్ని రోజులు ప్రయాణం చేశాడు.

ఒకనాడు అతనికి ఒక పెద్ద నది ఎదుర యింది. నదీ ప్రవాహాన్ని కొన్ని క్షణాలు పరిశీల నగా చూసిన యువరాజు, నదిని గుర్రం మీదే దాటాలనుకున్నాడు. మరుక్షణమే అతడు గుర్రంపై ఆవలిగట్టును చేరాడు. అదొక దట్ట మైన అరణ్యప్రాంతం. ఎత్తయిన వృక్షాలను తప్పుకుంటూ అతడు మెల్లగా ముందుకు వెళ్ళాడు. గుర్రం ఒక సమతల ప్రదేశాన్ని చేరుకోగానే హఠాత్తుగా ఆగిపోయింది. కొంత దూరంలో వున్న బ్రహ్మాండమైన ఎర్ర పాలరాతి భవనం యువరాజు దృష్టిని ఆకర్షించింది.

ఎత్తయిన భవన ముఖద్వారానికి పెద్ద భేరి వేలాడ దీయబడి ఉంది. ద్వారం వద్ద కాపలా భటులెవరూ కనిపించలేదు. యువరాజు భేరి మోగించాడు. కాని భవనం నుంచి ఒక్కరూ వెలుపలికి రాలేదు. యువరాజుకు చాలా వింతగా తోచింది. గుర్రాన్ని ఒక స్తంభానికి కట్టి, మెల్లగా లోపలికి ప్రవేశించాడు.

అక్కడతనికి కొందరు భటులు, సేవకులు, రాజోద్యోగులు వంటివారు కనిపించారు. అయితే ఎవరిలోనూ, జీవం లేదు. కదలిక లేదు. నడు స్తున్నప్పుడో, ఏవో పనులు చేస్తున్నప్పుడో శిలా ప్రతిమల్లా మారిపోయినట్టు కనబడ్డారు. పాల రాతి ప్రతిమలుగా మారిపోయిన మరి కొందరు సైనికులు, గుర్రాలు, ఏనుగులు యువరాజు దృష్టిని ఆకర్షించాయి.

యువరాజు మరి కొంతముందుకు వెళ్ళాడు. ఒక గది నిండా కత్తులు, కఠారులు, బల్లాలు విల్లంబులు కనిపించాయి. గది ముందు

శిలలుగా మారిన కాపలా భటులు కనిపించారు. ఇంకా కొంత ముందుకు వెళ్ళిన యువరాజుకు విశాలమైన సభామంటపంలో సింహాసనంపై కూర్చుని ఉన్న రాజు, పక్కనే వివిధ ఆభరణాలతో అలంకరించబడిన రాణి శిలా రూపాలలో కనిపించారు. ఎదురుగా కూర్చున్న మంత్రులూ, రాజోద్యోగులూ కూడా శిలలుగానే కనిపించారు. ఎవరిలోనూ కదలిక అన్నది ఏమాత్రం లేదు.

యువరాజు మెల్లగా మరి కొంత దూరం ముందుకు వెళ్ళి, పక్కగదిలోకి తొంగి చూశాడు. అందంగా అలంకరించబడిన పాలరాతి హంస తూలికాతల్పం మీద ఒక అందాల యువతి శిలారూపంలో పడుకుని ఉన్నది. పక్కనే ఆమె ఆనతికి ఎదురు చూస్తున్నట్టు ఒక పరిచారిక నిలబడి ఉన్నది. వారికి సమీపంలో వెండితో, బంగారంతో తయారుచేయబడిన రెండు మంత్ర దండాలు యువరాజు దృష్టిని ఆకర్షించాయి. అతడు బంగారు మంత్రదండాన్ని తీసుకుని యువరాణి వద్దకు వెళ్ళి దాన్ని ఆమె చేతికి తాకించాడు.

మరుక్షణమే అతనికి, ''ఎవరు మీరు?'' అన్న సుమధుర కంఠస్వరం వినిపించింది. పాలరాతి తల్పం మీది యువతి కళ్ళు తెరిచి, మెల్లగా లేచి కూర్చున్నది.

''సోమనాథపూర్ యువరాజు సోమరాజును. ఈ భవనంలో ప్రతి ఒక్కరూ చలన రహితంగా పాలరాతి శిల్పాల్లా ఉన్నారేమిటి?'' అని అడిగాడు యువరాజు.

''అదొక పెద్ద కథ యువరాజా! నా పేరు రత్నకుమారి. మా తండ్రి రత్నగిరి రాజు. చాలా సంవత్సరాలకు పూర్వం ఈ ప్రాంతం ఒక రాక్షసుడికి చెందినదట. వాడు దాన్ని వదిలి అరణ్య మధ్యంలోకి వెళ్ళాడట. ఆ సంగతి తెలియక మా తండ్రిగారు ఈ స్థలంలో అంటే రత్నపురి రాజధాని మధ్యంలో ఈ బ్రహ్మాండమైన పాలరాతి భవనాన్ని నిర్మించాడు. ఒక నాడు హఠాత్తుగా తిరిగి వచ్చిన రాక్ష





సుడు ఆగ్రహం చెంది భవనం మీదికి దాడి ప్రారంభించాడు. మా సైన్యం అపారంగా నష్ట పోయింది. ఇక చేసేది లేక మా తండ్రిగారు రాక్షసుడితో సంధి చర్చలకు దిగాడు. రత్నగిరి పర్వత సానువులకు దిగువగల లోయలో రాజ్యం స్థాపించడానికి ముందు ఈ ప్రాంతం రాక్షసుడికి చెందినదని తెలియక ఇక్కడ భవనం నిర్మించవలసి వచ్చిన అవసరం గురించి వివరించాడు,'' అన్నది ఆమె.

''అందుకు రాక్షసుడు ఏమన్నాడు?'' అని అడిగాడు సోమరాజు ఆత్రుతగా.

''ఇకపై రత్నగిరి ప్రజలకు ఎలాంటి ఇబ్బందులూ కలిగించనని మాట ఇచ్చాడు. అయితే, వాడు ఒక నిబంధన విధించాడు,'' అన్నది యువరాణి రత్నకుమారి.

''ఏమిటది?'' అని అడిగాడు యువరాజు.

''నన్ను వాడికిచ్చి వివాహం చేయాలని కోరాడు!'' అన్నది యువరాణి.

''ఆ దుర్మార్గుడు ఇప్పుడెక్కడున్నాడు? వాడి తలను తెగనరుకుతాను,'' అన్నాడు యువరాజు కోపావేశంతో.

''వాడిప్పుడు ఎక్కడున్నాడో ఎవరికీ తెలియదు. నా తండ్రి వాడి కోరికను నిరాకరించడంతో, ఆశాభంగానికి గురైన ఆ రాక్షసుడు వెండి మంత్రదండాన్ని తీసుకుని సుడిగాలిలా విజృంభించి దానితో క్షణంలో అందరినీ తాకి, రాతి విగ్రహాలుగా మార్చేశాడు. 'సాహసవీరుడైన ఒకానొక యువరాజు వచ్చి ఇక్కడి మంత్ర జలాలు చల్లి, బంగారు మంత్ర దండంతో తాకేంత వరకు మీరందరూ పాలరాతి విగ్రహాలుగా పడి ఉండండి,' అని శపించి మాయమైపోయాడు. రండి, నన్ను కాపాడినట్టే మిగతా వారిని కూడా కాపాడండి,'' అన్నది యువరాణి.

యువరాజు మొదట యువరాణి మందిరంలోని పాత్రను బంగారు మంత్రదండంతో స్పృశించాడు. అందులోని మంత్ర జలాలను భవనమంతా చిలకరించాడు. మొదట యువరాణి పరిచారికను మంత్రదండంతో తాకాడు. ఆమెకు శిలారూపం పోయి మానవ రూపం వచ్చింది. ఆ తరవాత రాజు, రాణి, మంత్రులు, రాజోద్యోగులు, భటులు అంటూ అక్కడ శిలలుగా పడివున్న ప్రతి ఒక్కరికీ బంగారు మంత్ర దండం సాయంతో మామూలు రూపాలు తెప్పించాడు. భవనానికి మళ్ళీ జీవకళ వచ్చింది. అందరూ ఆనందోత్సాహాలతో పొంగిపోయారు.

సోమరాజు చేసిన ఉపకారానికి రాజు పర

మానందం చెందాడు. అతనికి కృతజ్ఞతలు తెలియజేశాడు.

ఆ తరవాత రాజు సభ ఏర్పాటు చేసి, ''ఆ రాక్షసుడు తిరిగి వస్తే మనం ఏం చేయాలో ఇప్పుడే ఆలోచించి నిర్ణయించడం మంచిది కదా!'' అన్నాడు.

ఆ మాటకు రాజుకు పక్కనే ఉన్నతాస నంలో ఆసీనుడై వున్న సోమరాజు లేచి నిల బడి, ''రాక్షసుడు రెండు మంత్రదండాలనూ ఇక్కడే వదిలి వెళ్ళాడు. అవి మళ్ళీ వాడి చేతిలో పడకుండా జాగ్రత్త పడాలి. ఆ మంత్రదండాలు లేకపోతే వాడు శక్తిహీనుడై పోతాడనుకుంటాను. అప్పుడు మీ సైనికులే వాణ్ణి సులభంగా ఓడించ గలరు,'' అన్నాడు.

''యువరాజు సోమరాజు మాటలు అక్ష రాలా నిజం. అంతటి సూక్ష్మగ్రాహి ఎప్పటికీ మనతోనే ఉండడం మంచిది,'' అన్నాడు ప్రధానమంత్రి.

అందుకు రాజు మందహాసం చేస్తూ, ''అదేం పెద్ద సమస్య కాదు. యువ రాజు మన యువరాణిని వివాహ మాడడానికి సమ్మతించినట్టయితే, ఆయన ఎప్పుడూ మనతో ఉండ గలడు. నా సింహాసనానికి వార సుడు కాగలడు!'' అన్నాడు.

సోమరాజు మళ్ళీ లేచినిలబడి, ''ప్రభూ, నేనే స్వయంగా వధువును వెతుక్కోవాలనే ఆశయంతోనే మా రాజ్యం నుంచి బయలుదేరాను. నా కోరిక ఇక్కడ నెరవేరిందనే అనుకుంటున్నాను. మీరు అనుమతిస్తే, నేను మా రాజ్యానికి తిరిగి వెళ్ళి నా తల్లిదండ్రుల అనుమతి పొంది వస్తాను,'' అన్నాడు.

ఆ మాటకు సభాసదులందరూ లేచి నిల బడి చప్పట్లు చరుస్తూ హర్షధ్వానాలు చేశారు. ఆ తరవాత రాజు, ''యువరాజా, మీతో పాటు మా ప్రధానమంత్రి కూడా వచ్చి, ఇక్కడ జరి గిన విషయాలూ, మా కోరికా తమ తల్లిదండ్రు లకు విన్నవించగలడు,'' అన్నాడు.

యువరాణి రత్నకుమారితో తమ కుమారు డికి జరుగనున్న వివాహం గురించి తెలుసు కున్న రాజు సోమదేవుడూ, రాణీ ఎంతగానో సంతోషించారు. పరివారంతో రత్నపురికి బయలు దేరి వెళ్ళి, అత్యంత వైభవంగా జరిగిన కుమా రుడి వివాహం చూసి పరమానందం చెందారు.






# రామయ్య కోరిక

వెంకటాపురంలో కూలిపనులు చేసుకుని బతికే రామయ్యకు నలుగురు సంతానం. ఆ ఊళ్ళో కూలిపనులు రోజూ దొరకవు. దొరికినా వచ్చే ఆదాయం తక్కువ. కడుపునిండా తిన డానికి తిండీ, కట్టుకోవడానికి బట్టా లేకుండా ఇంటిల్లిపాదీ ఉసూరుమంటూ బతుకీడుస్తు న్నారు.

ఒకనాటి రాత్రి రామయ్యకు గారెలు తింటున్నట్టు కలవచ్చింది. నిద్రలోనే నోరూ రింది. లేవగానే భార్య మంగమ్మతో తన కల గురించి చెప్పాడు. మంగమ్మ నిట్టూర్చి, ''గంజినీళ్ళకు గతిలేదు గానీ, గారెల ముచ్చట ఒకటి మనకు,'' అన్నది.

ఆ తరవాత ముంతలో నూకల గంజి తెచ్చి భర్త ముందుంచి, ''పట్నం పోయి ఏదయినా పని చూసుకోమంటే నా మాట వినవు. నూతిలోని కప్పలా ఈ ఊళ్ళోనే ఉంటే మన బతుకు ఇలాగే ఉంటుంది,'' అన్నది.

రామయ్యకు ఉన్న ఊరు వదిలి వెళ్ళాలంటే అయిష్టం, బెరుకూను. అందుకే భార్య అలా అన్నప్పుడల్లా, ''చూద్దాంలే,'' అంటూ మాట దాటవేస్తూ ఉంటాడు. ఇప్పుడు కూడా అదే సమాధానం చెప్పి, కాళ్ళు చేతులు కడుక్కొని రావడానికి పెరట్లోకి వెళ్ళాడు.

ఈలోగా పక్కింటి రైతు వెంకయ్య ఏడు నెలల కొడుకు పాక్కుంటూ వచ్చి, అక్కడ ఉంచిన ముంతను తోసి గంజిని ఒలకబోసే శాడు. అది చూసి, ''నీవల్ల ఈ గంజినీళ్ళు కూడా నాకు ప్రాప్తం లేకుండా పోయాయి గదరా,'' అని విసుక్కున్నాడు రామయ్య.

''పోనీ లేవయ్యా, పాపం పసిబిడ్డ. వాడికేం తెలుసు. ఇప్పుడిప్పుడే పాకడం నేర్చుకుంటు న్నాడు. మనమే జాగ్రత్తగా ఉండాలి,'' అన్నది మంగమ్మ.

ఆకలి కడుపుతోనే రామయ్య ఊళ్ళోకి పని కోసం బయలుదేరాడు. ఆ పూట ఎక్కడా పని

వి. పద్మప్రియ

దొరకలేదు. కరణం గారి ఇంటి ముందు నుంచి వస్తూంటే, గారెలు వేగుతూన్న వాసన వాళ్ళింటి నుంచి కమ్మగా వీచింది. రామయ్యకు నోరూరింది. అప్పుడే ఇంటి నుంచి బయటకు వస్తూన్న కరణంగారితో, "అయ్యా, ఏదైనా పని ఉంటే చెప్పండి చేస్తాను," అన్నాడు.

"ఈ రోజు మా తండ్రిగారి ఆబ్దీకం. అందరం హడావుడిగా ఉన్నాం. సరే, నువ్వు నూతి లోంచి నీళ్ళు తోడి ఆ తొట్టె నింపు," అని చెప్పి కరణం లోపలికి వెళ్ళిపోయాడు.

పాతాళంలో ఎక్కడోవున్న నీళ్ళన్నీ, శ్రమపడి తోడి తొట్టె నింపాడు రామయ్య. గంట తరవాత కరణంగారి భార్య, రెండు రూపాయలు రామయ్య చేతిలో పెట్టి, ఇక వెళ్ళమన్నది.

"అమ్మగారూ, రెండు గారెలుంటే పెట్టండి," అని నోరు తెరిచి అడిగాడు రామయ్య.

"అయ్యో, గారెలెక్కడ మిగిలాయిరా! వచ్చిన వాళ్ళే తినేశారు," అన్నది ఆమె.

రామయ్య నిరాశపడి నూకలు కొనుక్కోవడం కోసం, శెట్టి దుకాణానికి వెళ్ళాడు. "ఒరేయ్, రామయ్యా, మా ఆవిడ గారెల కోసం పిండి రుబ్బుతోంది. నాలుగు గారెలు తిని వెళుదువుగానీ, ఈలోగా వాకిట్లోని ఆ బస్తాలు తీసుకువచ్చి లోపల సర్దు నాయనా," అన్నాడు శెట్టి.

రామయ్య మహదానందంతో, బస్తాలన్నీ మోసుకొచ్చి ఇంట్లో పడేశాడు.

తీరా ఆ పని అయ్యేసరికి, పిండి రుబ్బుతూన్న శెట్టి భార్యను, రోలు కిందినుంచి



బయటకొచ్చిన ఒక తేలు కుట్టింది. ఆవిడ లబోదిబో మంటూంటే, శెట్టి ఇంటికి తాళం వేసి, భార్యను తీసుకుని వైద్యుడి వద్దకు పరిగెత్తాడు.

''నా అదృష్టం ఎంత నవ్వులాటగా తయారయిందో,'' అనుకుంటూ రామయ్య నూకల సంచీతో ఇల్లు చేరాడు.

మంగమ్మ బాదం ఆకులో ఆరు గారెలు తీసుకొచ్చి భర్తకు అందిస్తూ, ''నీ కల నిజం అయిందిలే. తిను,'' అన్నది నవ్వుతూ.

రామయ్య గారెలను చూసి ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బవుతూ, ''ఎక్కడివి? ఎలా వచ్చాయి?'' అని అడిగాడు.

''పక్కింటి వెంకయ్య కొడుకు పాకుతున్నాడు కదా. పిల్లలు గడప దాటితే గారెలు వండటం అన్నది మనవాళ్ళ ఆచారం. ఉన్నది ఒక్కగానొక్క బిడ్డ. అందుకే వెంకయ్య భార్య గారెలు చేసి, మనకు కూడా ఇచ్చింది,'' అన్నది మంగమ్మ.

''మరి మన పిల్లలకూ,'' అని అడిగాడు రామయ్య.

''నీకు ఇష్టం అని నీ కోసమే దాచాను. వాళ్ళు రాకముందే తినెయ్,'' అన్నది మంగమ్మ. రామయ్య కళ్ళు చెమ్మగిల్లాయి. గారెలను భార్యకు తిరిగి ఇస్తూ, ''వద్దులే. వాళ్ళూరానీ. పిల్లలతో కలిసి అందరం తలా ఒకటి తిందాం,'' అన్నాడు.

ఈలోగా వెంకయ్య కొడుకు పాక్కుంటూ వచ్చి, రామయ్య కేసి చూసి బోసి నవ్వు నవ్వాడు. రామయ్య వాణ్ణి ఎత్తుకుని ముద్దాడుతూ, ''పసిబిడ్డ దోగాడుతూ గడపదాటితే అదొక ఆనందం, వేడుక. సంపాదించ వలసిన మగవాడు గడపదాటకపోతే అది అరిష్టము, అవకరమూను. అందునా అధిక సంతానంతో అవస్థలు పడుతూన్న నేను, రేపు పిల్లల మంచి చెడుల గురించి పట్టించుకోకుండా, సంపాదన లేని ఈ ఊళ్ళోనే ఉండిపోవడం అవివేకం. అందుకే నువ్వన్నట్టుగానే నేను పట్నం పోదామని అనుకుంటున్నాను. రేపు తెల్లవారు జామునే లేపు,'' అన్నాడు భార్యతో.

భర్త మాటలకు మంగమ్మ ముఖం కళకళలాడింది.





# నగరాన్ని జయించబోయిన నక్క

పూర్వం ఒకప్పుడు బోధిసత్వుడు వారణాశీ నగరంలోని ఒక గొప్ప పండిత కుటుంబంలో జన్మించాడు. అతడు యుక్తవయస్కుడవుతూనే సర్వ శాస్త్రాలూ అభ్యసించి, పండితులందరిలోనూ గొప్పవాడనిపించుకున్నాడు. ఆ కారణంగా రాజు అంత చిన్నవయసులోనే ఆయనను తన ఆస్థానంలో ప్రధాన పౌరోహితుడుగా నియమించాడు.

బోధిసత్వుడు తాను శాస్త్రగ్రంథాలు పఠిస్తున్న సమయంలో, ఒక అద్భుతమైన మంత్రాన్ని కనుగొన్నాడు. దాని ప్రభావంతో ఇతరుల మీద సర్వాధికారాలు చలాయించవచ్చు. ఆ మంత్రం ఒక్కసారి చదివితే, ఎంతటి వాళ్ళయినా దాసోహం అనవలసిందే!

ఆ మంత్ర ప్రభావంతో ఎవరిపైనా అధికారం నెరపాలని బోధిసత్వుడికి ఆశలేదు కాని, దాన్ని మరిచిపోకుండా జాగ్రత్తపడాలన్న ఆలోచన కలిగింది.

ఇందుకు బోధిసత్వుడు అరణ్యంలోని ఒకానొక ఏకాంత ప్రదేశాన్ని ఎన్నుకున్నాడు. అక్కడ వున్న ఒక ఎత్తయిన రాతిపై కూర్చుని, ఆయన పరిసరాలను ఒకసారి చూశాడు. ఎక్కడా మనిషిగానీ, జంతువుగానీ ఆయన కంటబడలేదు.

బోధిసత్వుడు ఆ అద్భుత మంత్రాన్ని గొంతెత్తి చాలాసార్లు చదివి, సూర్యాస్తమయం అవుతూండగా, రాతి మీది నుంచి లేచి, నగరానికి బయలుదేరాడు.

ఆ సమయంలో రాతి వెనుక వున్న బొరియలోంచి నక్క ఒకటి గెంతుతూ బయటికి వచ్చి, "ఓయ్, పండితుడా! నువ్వు చదివిన మంత్రాన్ని, నేను కంఠస్థం చేశాను; వేయి నమస్కారాలు!" అంటూ అక్కణ్ణించి పరిగెత్త సాగింది.

నక్కలాంటి హీనప్రాణి అంత శక్తివంతమైన మంత్రం నేర్చుకోవడం చూసి, బోధి



సత్యుడు ఎలా అయినా దాన్ని పట్టుకోవాలని వెంటబడ్డాడు. కాని, అప్పటికే చీకటి కమ్ము తున్న కారణంగా దాపులవున్న పొదలచాటున నక్కుతూ, అది పారిపోయింది.

ఈ నక్క అంతకు పూర్వజన్మలో బ్రాహ్మణుడుగా పుట్టి, బతికినన్నాళ్ళూ అమితమైన జిత్తులమారితనం తోనూ, పరులకు హాని చేస్తూనూ కాలం వెళ్ళబుచ్చింది. ఆ మానవ జన్మ కారణంగా దానికి మంత్రానికి వున్న అద్భుతశక్తి తెలిసిపోయింది.

పారిపోతున్న నక్కకు ఎదురుగా తనకన్న మంచి కండబలం, వాడిపళ్ళూ వున్న నక్క ఒకటి రావడం కంటబడింది. వెంటనే అది భయంతో మంత్రం చదివింది. ఎదురు వస్తున్న నక్క అక్కడే ఆగి మెల్లగా దానికి వంగి నమస్కరించి, ఎంతో అణకువగా దారి తొలగింది. మంత్రం నేర్చిన నక్కకు ఎక్కడలేని ఆనందం కలిగింది.

ఈ విధంగా నక్క కొద్దిరోజుల్లో ఎన్నో వందల నక్కలపై ఆధిపత్యం సంపాయించింది. తరవాత అది తన మంత్రశక్తిని అడవి పందుల మీదా; పులులూ, సింహాలూ, ఏనుగులపై ప్రయోగించి, వాటన్నిటినీ లోబరుచుకున్నది. ఆ జంతువులన్నీ నక్కను తమ రాజుగా అంగీకరించి, గొప్ప ఉత్సవం జరిపినై.

రాజు నక్క, ఒక ఆడనక్కను వివాహమాడి, దాన్ని రాణీగా ప్రకటించింది. సింహాలూ, పులులలో నుంచి కొన్నింటిని మంత్రులుగా, సేనానాయకులుగా ఎన్నిక చేసింది. ఇన్ని అరణ్యమృగాలు తన ఆజ్ఞలను శిరసా వహిస్తూ, తనకూ, తన భార్యకూ సేవలు

చేస్తూండడం దానికి ఎక్కడలేని గర్వాన్నీ కలిగించింది.

రెండు ఏనుగులను పక్క పక్కన నిలబెట్టి, వాటిపైన సింహాన్ని నిలిపి, దానిపైన రాజునక్క ఆసీనురాలయ్యేది. కొన్ని జంతువులు, దాన్ని మించిన రాజు ప్రపంచంలో లేడంటూ విపరీతంగా పొగడసాగినై.

నక్కకు ఇవన్నీ వింటూంటే ఆనందంతో పాటు గర్వం కూడా అధికం కాసాగింది. "ఈ జంతువులకు రాజునన్న తృప్తితో ఎందుకు కాలం గడపాలి? ఏకంగా వారణాశీ నగరాన్నే ఎందుకు జయించ కూడదు?" అన్న ఆలోచన దానిక్కలిగింది.

కొద్ది రోజుల్లోనే అది మృగాల్లో సాటిలేని బలంగల సింహాలనూ, కొద్దిపాటి ఇతర జంతువులనూ సైన్యంగా సమకూర్చుకుని వారణాశీ నగరం పైకి దాడివెళ్ళింది. అవి రావడం చూసిన నగర వాసులు కొందరు భయకంపితులై, నగర వీధుల్లో పరిగెత్తుతూ, ఈ వార్తను ప్రజలకు తెలియబరిచారు. నగరంలో కల్లోలం ప్రారంభమయింది.

రాజునక్క నగర ద్వారం చేరి, చావు భయంతో వణికిపోతున్న కాపలావాళ్ళతో, "ఒరే, మీరు తక్షణం పోయి, మీ రాజును లొంగిపొమ్మని చెప్పండి. అలా లొంగక పోయాడో, నా సైన్యంతో మీ నగరం మీద దాడి చేయగలను," అన్నది.

కాపలావాళ్ళ ద్వారా ఆ సంగతి విన్న రాజుకు ఏమిచేయాలో పాలుబోలేదు. బోధిసత్వుడు ఆయనతో, "మహారాజా, ఈ సమస్యను పరిష్కరించే పని నాకు వదలండి," అన్నాడు.



తరవాత ఆయన కోటగోడ మీదికి పోయి, నక్కరాజును, "నగరాన్ని ఎలా జయించదలిచావు?" అని అడిగాడు.

రాజునక్క పెద్దగా నవ్వి, "ఆ పని చాలా తేలిక! నా సైనిక సింహాలన్నీ ఏకకంఠంతో ఒక్కసారి గర్జించితే, మీ సైనికులూ, పౌరులూ ప్రాణభయంతో చెల్లా చెదురుగా పారిపోతారు," అన్నది.

బోధిసత్వుడికి నక్కమాటలు అబద్ధం కాదని తోచింది. ఆయన గోడదిగువ నున్న రాజోద్యోగులతో, "మీరు వెంటనే వెళ్ళి, నగరవాసులందర్నీ బయటి శబ్దం వినిపించకుండా తమ చెవుల్లో దూది పెట్టుకోవలసిందిగా చెప్పండి," అన్నాడు.

ఆ పని పూర్తి కాగానే ఆయన రాజునక్కతో, "నగరాన్ని జయించేందుకు నువ్వేం చేయదలిచావో చెయ్యి!" అన్నాడు.

రెండు ఏనుగులపై నిలబడిన సింహం మీద కూర్చుని వున్న రాజునక్క, సింహాలన్నిటినీ ఒక్కసారిగా భయంకర గర్జన చేయమని ఆజ్ఞాపించింది. ఆ మరుక్షణం పరిసరాలన్నీ దద్దరిల్లిపోయేలా సింహాలు గర్జించినై. తమ చెవి రంధ్రాలను దూదితో దట్టించిన కారణం వల్ల నగరవాసులకు సింహగర్జనలేవీ వినిపించలేదు. కాని, ఆ గర్జనలు వింటూనే రాజునక్కను మోస్తున్న రెండు ఏనుగులూ ఎగిరి గంతు వేసినై. దానితో వాటిమీద నిలబడి వున్న సింహం కిందపడింది. ఏనుగులు భీతిల్లి పరిగెత్తుతూ తమ కాళ్ళతో రాజునక్కను చితకతొక్కినై. మిగిలిన మృగాలు భయపడి పారిపోతూ, ఒక దాన్నొకటి తొక్కుకుని కొన్ని చావగా, కొన్ని అరణ్యం చేరినై.

ఈ జరిగినది చాటింపు ద్వారా తెలుసుకుని నగరవాసులు తమ చెవులలో దట్టించిన దూదిని తీసి వేశారు. ముంచుకు వచ్చిన ఆపద తప్పిపోయినందుకు వాళ్ళందరూ ఎంతో సంతోషించారు.

రాజుతోపాటు నగరవాసులందరూ, తమను ఇంత ఘోరమైన ఆపద నుంచి కాపాడిన బోధిసత్వుడికి తమ కృతజ్ఞత తెలియజేశారు.





# రామాయణం

రాముడు సీతా లక్ష్మణులతో సహా మహా భయంకరమైన దండకారణ్యం ప్రవేశించాడు. అరణ్యం అంచునే ఋష్యాశ్రమాలున్నాయి. ఆశ్రమాలుండే ప్రాంతం అందంగా, ప్రశాంతంగా కనిపించింది.

అక్కడి ఋషులు సీతారామలక్ష్మణులకు చక్కని ఆతిథ్యమిచ్చి, ''రామా, రాజు దుష్ట శిక్షణ చేస్తాడు గనక, ప్రజలకు తండ్రి వంటి వాడు. మేము నీ రాజ్యంలో ఉన్నాం. నువ్వు పట్టణంలో ఉన్నా, అరణ్యంలో ఉన్నా మాకు రాజువే. అందుచేత నువ్వే మమ్మల్ని ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉండాలి,'' అన్నారు.

రాముడు ఆ ఆశ్రమాలలో రాత్రి గడిపి ఉదయం కాగానే సీతా లక్ష్మణులతో సహా నిర్జనమైన భీకరారణ్యం ప్రవేశించాడు. ఇక్కడ అందమన్నది లేదు. ఎటు చూసినా భయంకరమైన దృశ్యాలే. చెట్లు చీకాకుగా ఉన్నాయి. నీటి మడుగులు అసహ్యం పుట్టిస్తున్నాయి. సమస్త భీకర జంతువులూ ఆ అరణ్యంలో తిరుగాడుతున్నాయి.

దారిలేని ఆ అరణ్యంలో పడి వారు పోతూండగా వారికొక రాక్షసుడు ఎదురయ్యాడు. వాడు చాలా ఎత్తుగా ఉన్నాడు. పెద్ద నోరు; పెద్ద పొట్ట; చూస్తేనే రోత పుట్టే ఆకారం! వాడి చేతిలో ఒక పెద్ద శూలం ఉన్నది. దానికి సింహాలూ, పులులూ, తోడేళ్ళూ, జింకలూ, ఒక ఏనుగు తలా గుచ్చి ఉన్నాయి. ఆ రాక్షసుడు సీతారామలక్ష్మణులను చూస్తూనే యముడిలాగా మీదికి వచ్చి, సీతను అవలీలగా ఎత్తి చంకన పెట్టుకుని, ''మీరు ఆయువు తీరి ఈ అరణ్యంలోకి వచ్చినట్టున్నారు. మీరు చూస్తే ఋషి, వేషాలు ధరించారు, మరి మీ



వెంట ఈ ఆడది ఎందుకున్నది? నేను దీన్ని పెళ్ళాడేస్తాను. ఋషులను తినటం నాకు అలవాటే, అందుచేత మిమ్మల్ని చంపి మీ రక్తం తాగేస్తాను,'' అన్నాడు.

రాక్షసుడి చంకలో చిక్కి గిలగిలా కొట్టుకుంటున్న సీతను చూడగానే రాముడికి దుఃఖంతో నోరార్చుకు పోయింది. అతను లక్ష్మణుడితో, ''ఏ ఉద్దేశంతో కైకేయి నన్ను అడవికి పంపిందో ఆ ఉద్దేశం కొంచెం కొంచెమే నేరవేరుతున్నది. లక్ష్మణా, తండ్రి చనిపోయినా, రాజ్యం పోయినా కలగని బాధ వీడు సీతను తాకటం చేత కలుగుతున్నది!'' అన్నాడు కన్నీరు కార్చుతూ.

రాముడి దుఃఖం చూసి లక్ష్మణుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. 'నేను పక్కన ఉండగానే అలా విచారిస్తావేమిటి? ఒక్క బాణంతో నేను వీడి ప్రాణాలు తీస్తాను,'' అని అతను రాముడితో అని రాక్షసుడితో వెటకారంగా, ''నాయనా, ఈ అరణ్యంలో సుఖంగా తిరిగే నువ్వెవడవు?'' అన్నాడు.

''అడిగేవాణ్ణి నేను, చెప్పేది మీరు! ఎక్కడికి పోతున్నారు? ముందు నువ్వు అది చెప్పు,'' అన్నాడు రాక్షసుడు.

''మేము క్షత్రియులం. సదాచారం గల వాళ్ళం. అరణ్యవాసం చేస్తున్నాం. నీ సంగతి చెప్పు,'' అన్నాడు రాముడు.

''నా సంగతి చెబుతా విను. నా తండ్రి జయుడు, తల్లి శతహ్రద. నా పేరు విరాధుడు. బ్రహ్మను గురించి పెద్ద తపస్సు చేసి నేను ఏ ఆయుధంతో కూడా చావకుండా వరం పొందాను. నన్నెవరూ ఏమీ చేయలేరు. అందుచేత మీరు ఆడదాని మీద ఆశ వదులుకుని, పారిపోయి ప్రాణాలు రక్షించుకోండి. మీ ప్రాణాలు తీస్తే నాకేం లాభం?'' అన్నాడు రాక్షసుడు.

రాముడి కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. ''నీచుడా, పరస్త్రీ హరణం చేస్తావా? నీకు కాలం మూడింది,'' అంటూ అతను విల్లు ఎక్కుపెట్టి ఏడు కరుకైన బాణాలు రాక్షసుడి శరీరంలో దిగిపోయేటట్టు కొట్టాడు.

విరాధుడు ఎగతాళిగా నవ్వుతూ సీతను కింద దించి, ఒక్కసారి ఒళ్ళు విరుచుకునే సరికి ఏడు బాణాలూ వాడి శరీరం నుంచి బయటికి వచ్చి, కింద పడిపోయాయి. వాడు కోపంతో శూలం ఎత్తి రామలక్ష్మణుల పైకి వచ్చాడు.

రాముడు రెండు బాణాలతో వాడిశూలాన్ని ముక్కలు చేశాడు.

కాని విరాధుడు లక్ష్య పెట్టక వారిని పట్టుకోవటానికి యత్నించాడు. రామ లక్ష్మణులు కత్తులు దూసి వాణ్ణి ఎన్నో పోట్లు పొడిచారు. ఆ పోట్లనుకూడా లక్ష్యపెట్టక వాడు ఆ ఇద్దరినీ అవలీలగా చెరొక భుజం మీదికి ఎత్తుకుని అరణ్యానికి అడ్డం పడి నడవసాగాడు.

''వీడిలా మనని ఎక్కడికి తీసుకుపోతాడో చూద్దాం,'' అని రాముడు లక్ష్మణుడితో అన్నాడు.

కాని సీత మాత్రం గట్టిగా ఏడుస్తూ, ''అయ్యో, ఈ రాక్షసుడు రామ లక్ష్మణులను ఎత్తుకు పోతున్నాడు. నన్ను తోడేళ్ళు, పెద్దపులులో మింగేస్తాయి! ... ఓ రాక్షసుడా, నీకు దణ్ణం పెడతాను. దయతలచి వారిని వదిలేసి నన్ను తీసుకుపో!'' అన్నది.

సీత చేసిన ఆర్తనాదం వినగానే రామ లక్ష్మణులు కూడబలుక్కుని, తమ చేతులలో ఉన్న కత్తులతో విరాధుడి భుజాలు రెండూ నరికేశారు. వాడు కాస్తా పర్వతం కూలినట్టు కూలాడు. అలా కింద పడిన ఆ రాక్షసుణ్ణి రామ లక్ష్మణులు పిడికిళ్ళతోనూ, మోకాళ్ళతోనూ కుమ్మి చితక బొడిచారు. అప్పటికీ వాడి ప్రాణం పోలేదు.

విరాధుడు కదలకుండా వాడి కంఠంపైన కాలువేసి బలంగా తొక్కి పట్టి, రాముడు, ''లక్ష్మణా, వీణ్ణి ఇలాగే పూడ్చేద్దాం. ఒక పెద్ద గొయ్యి తవ్వు,'' అన్నాడు. లక్ష్మణుడు వాడి పక్కనే గొయ్యి తవ్వాడు. రామలక్ష్మణులు



వాణ్ణి ఆ గోతిలోకి బలాత్కారంగా తోసేశారు. గోతిలో పడిపోతూ వాడు పెట్టిన పెడబొబ్బకు అరణ్యమంతా దద్దరిల్లింది. తరవాత రామ లక్ష్మణులు గుంటను రాళ్ళతో పూడ్చేశారు.

రాముడు సీతను కౌగలించుకుని, ధైర్యం చెప్పి, లక్ష్మణుడితో, ''మనం ఇలాటి అరణ్యానికి అలవాటుపడిన వాళ్ళం కాదు. అందుచేత ఇక్కడ ఉండటం మంచిది కాదు. త్వరగా శరభంగ మహాముని ఆశ్రమానికి పోదాం,'' అన్నాడు.

వారు శరభంగ మహాముని ఆశ్రమాన్ని చేరవస్తూ ఉండగా రాముడి కొక వింత దృశ్యం కనిపించింది. భూమికి ఎత్తుగా ఒక కాంతివంతమైన రథం కనిపించింది. దానికి ఆకుపచ్చని గుర్రాలు కట్టి ఉన్నాయి. సూర్యుడులాగా వెలిగి పోతున్న ఒక మహాపురు

షుడు, కాంతివంతమైన ఆభరణాలూ, స్వచ్ఛమైన బట్టలూ ధరించి, నేలను అంటకుండా ఆశ్రమం కేసి పోవటం కనిపించింది. ఆయన వెంట ఆయనలాటి వాళ్ళే అనేక మంది పరివారంగా ఉన్నారు. అందరూ పాతికేళ్ళ వయస్సుగలవాళ్ళే.

రాముడు లక్ష్మణుడికి ఈ దృశ్యం చూపించి, ''లక్ష్మణా, అది దేవేంద్రుడు లాగుంది. నేను వెళ్ళి తెలుసుకువస్తాను. నువ్వూ, సీతా ఇక్కడే ఉండండి,'' అంటూ బయలుదేరాడు.

ఆ వచ్చినది నిజంగా దేవేంద్రుడే. శరభంగ మహామునిని బ్రహ్మలోకానికి తీసుకువెళ్ళటానికి స్వయంగా తన రథంలో వచ్చాడు. రాముడు తన కోసం వస్తున్నాడని గ్రహించి ఇంద్రుడు శరభంగుడితో, ''రాముడు నన్ను కలుసుకోవటానికి వస్తున్నాడు. అతనివల్ల ఒక మహాకార్యం జరగాలి. అది ముగిసినదాకా అతనికి కనపడటం నా కిష్టం లేదు,'' అని చెప్పి తన రథమెక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

తన ప్రయత్నం విఫలంకాగా రాముడు సీతా లక్ష్మణులను కలుపుకుని శరభంగుడి వద్దకు వచ్చి నమస్కరించాడు. అప్పటికే శరభంగుడు అగ్నిప్రవేశం చెయ్యటానికి ఏర్పాట్లన్నీ చేసుకుని ఉన్నాడు.

రాముడు దేవేంద్రుణ్ణి గురించి అడగగా ఆయన, ''అవును, నేను తపశ్శక్తి చేత బ్రహ్మలోకం సాధించుకున్నాను. నన్ను తీసుకుపోవాలని ఇంద్రుడు వచ్చాడు. నీవు నా కోసం వస్తున్నావని తెలిసి, నిన్ను చూసి మరీ పోదామనుకున్నాను. నేను సాధించిన బ్రహ్మలోక, స్వర్గలోకాలను నీకు దానం చేస్తాను, పుచ్చుకో,'' అన్నాడు.



''స్వామీ, నాకు కావలిసిన లోకాలను నేనే సంపాదించుకుంటాను. ప్రస్తుతం ఈ అరణ్యంలో నాకు వాసయోగ్యమైన చోటేదో చెప్పండి,'' అన్నాడు రాముడు.

''ఈ యేటి వెంబడే పోతే సుతీక్ష్ణ మహాముని ఆశ్రమం వస్తుంది. ఆయన నీకు తగిన చోటు చూపించగలుగుతాడు. పాము కుబుసాన్ని విడిచినట్టు నేనీ దేహాన్ని విడవటం చూసి మరీ వెళ్ళండి,'' అంటూ శరభంగ మహాముని అగ్నిలో ఆజ్యం పోసి అందులో ప్రవేశించాడు. ఆయన శరీరం అస్థికలతో సహా దగ్ధమయ్యాక, ఆయన ఇరవై అయిదేళ్ళ ప్రాయంగల దివ్యశరీరంతో అగ్ని నుంచి వెలువడటం చూసి సీతా రామలక్ష్మణులు నివ్వెరపోయారు.

శరభంగుడు దేహం చాలించగానే ఆశ్రమంలోని మునులందరూ రాముడి వద్దకు వచ్చి, ''రామా, పంపాతీరంలోనూ, చిత్రకూటంలోనూ, మందాకినీ తీరంలోనూ ఉండే ఋషులను రాక్షసులు చెప్పరాని హింసలు పెడుతున్నారు. క్రూరులైన ఈ రాక్షసుల బారినుంచి ఋషులను నువ్వే కాపాడాలి,'' అన్నారు.

''నేను అరణ్యవాసం రావటంలో తండ్రి ఆజ్ఞను పాలించే మేలు ఒకటేననుకున్నాను. ఇప్పుడు నాకు మీ మూలంగా మరొక మేలు కూడా చేకూరుతుందన్న మాట. నేను తప్పక రాక్షసుల బారి నుంచి మునులను కాపాడతాను,'' అని రాముడన్నాడు.

రాముడు సుతీక్ష్ణుడి ఆశ్రమానికి బయలుదేరుతుంటే వైఖానసుడు మొదలైనవారు



అతని వెంట కదిలారు. వారందరూ కొన్ని నదులను దాటి, ఒక పర్వతం పక్కగానున్న అరణ్యం ప్రవేశించారు. ఆ అరణ్యంలోనే తపోసంపన్నుడైన సుతీక్ష్ణ మహాముని ఆశ్రమం ఉన్నది.

రాముడు తన పేరు చెప్పుకుని నమస్కారం చెయ్యగానే సుతీక్ష్ణుడతన్ని కౌగలించుకుని, ''రామా, నువ్వు చిత్రకూటం చేరినప్పటి నుంచీ నీ వార్తలు వింటూనే ఉన్నాను. నేను చాలా తపస్సు చేశాను. అదంతా నీ కిస్తాను, సీతా లక్ష్మణులతో అన్ని లోకాలూ అనుభవించు,'' అన్నాడు.

''స్వామీ, లోకాలన్నీ నేనే సంపాదించుకుంటాను. నాకీ అరణ్యంలో నివాసయోగ్యమైన స్థానం ఉంటే చెప్పండి చాలు,'' అన్నాడు రాముడు.

"కావాలంటే ఈ ఆశ్రమంలోనే ఉండ వచ్చు. ఇక్కడ మృగబాధ తప్ప మరే బాధా లేదు," అని సుతీక్ష్ణుడు చెప్పాడు.

"నేను పొరపాటున ఆశ్రమ మృగాలను చంపినట్టయితే మీకు కోపం రావచ్చు. అందు చేత ఈ ఆశ్రమం నాకు వద్దు," అన్నాడు రాముడు.

సీతారామలక్ష్మణులు ఆ రాత్రి అక్కడే సుఖంగా గడిపారు. మర్నాడు ఉదయం కాల కృత్యాలు ముగించి రాముడు సుతీక్ష్ణుడితో, "స్వామీ, నా వెంట వచ్చిన మునులు తొందర చేస్తున్నారు. మాకు సెలవిప్పించండి," అన్నాడు.

సీత, రామలక్ష్మణుల ఆయుధాలు తెచ్చి ఇచ్చింది. దారిలో సీత రాముడితో, "ప్రపంచంలో మూడు మహా పాపాలు: అబద్ధం చెప్పటమూ, పర స్త్రీని కోరటమూ, అకారణ వైరమూనూ. అన్నిటిలోకీ అకారణ వైరం చాలా చెడ్డది. మొదటి రెండు పాపాలూ నిన్నంటలేవు, నాకు తెలుసు. కాని మనకు ఏ కీడూ చేయని రాక్షసులను నీ వెందుకు చంపాలి? వారిని చంపుతానని ఈ ఋషుల కెందుకు మాట ఇవ్వాలి? అసలు ఆయుధాలు వెంట ఉండటమే ఒక కీడు. పూర్వం ఒక ముని తపస్సు చేసుకుంటూ ఉంటే తపోభంగం కలిగించటానికి ఇంద్రుడు ఒక భటుడి రూపంలో వచ్చి తన కత్తిని భద్రంగా దాచి ఉంచమనీ, మళ్ళీ వచ్చి తీసుకుంటాననీ చెప్పాడట. ఆ ముని ఆ కత్తిని కాపాడటానికి వెంట ఉంచుకుని తిరుగుతూ, మొదట్లో పళ్ళూ ఫలాలూ కోశాడట. కాని రానురాను అతడి బుద్ధి హింసవైపు మళ్ళి, చివరకు చచ్చి నరకానికి వెళ్ళాడట. అందు చేత మనం కనీసం ఈ అరణ్యవాస కాలంలోనైనా ఆయుధాలు విసర్జించి తపస్సు చేసుకుందాం. తిరిగి అయోధ్యకు వెళ్ళాక క్షత్రియ ధర్మం పాటించవచ్చు. ఇది ఆదేశం కాదు, సూచన మాత్రమే," అన్నది.

రాముడు సీతతో, "ఆ మునులందరూ ప్రాధేయ పడితే వారి కోరికపై, రాక్షసులను చంపి వారి తపస్సు నిర్విఘ్నంగా కొనసాగేలా చూస్తానని మాట ఇచ్చాను. నిన్నూ, లక్ష్మణుణ్ణీ, నా ప్రాణాలనూ వదులుతాను గాని చేసిన ప్రతిజ్ఞ విడవను," అన్నాడు.





# దొరికిన దొంగ

రుద్రపూరు రాజైన జయపాలుడి భార్య రూపమతి వద్ద అపురూపమైన గులాబీ రంగు ముత్యాలహారం ఉండేది. అది అంటే ఆమెకు అమితమైన అభిమానం.

జయపాలుడు అదృష్టవంతుడు. అతని భార్య రూపమతి అందగత్తె. వారికొడుకు శక్తిపాలుడు పదేళ్ళవాడు–వాడుకూడా అందగాడే. అతని ప్రజలు రాజంటే అభిమానం గలవారు. రాజ్యం సుభిక్షం.

ఒకనాడు జయపాలుడు సపరివారంగా వేటకు వెళ్ళాడు. మధ్యాహ్నందాకా వేట చక్కగా సాగింది. కాని మిట్టమధ్యాహ్నం అందరూ విశ్రాంతి తీసుకునేసమయంలో అతిదారుణమైన తుపాను వచ్చిపడింది. వేటకని తెచ్చిన ఏనుగులూ, గుర్రాలూ వశం తప్పాయి. రాజు ఎక్కిన రథం ఒక చెట్టుకు తగలటంవల్ల దాని చక్రం ఒకటి చిన్నాభిన్నమయింది. వెంటనే జయపాలుడు ఒక గుర్రం ఎక్కాడు. అది అదుపు తప్పి, చిత్తం వచ్చినట్టు, దారీ తెన్నూ లేకుండా పరిగెత్తసాగింది. తక్కువ ఎత్తులో ఉన్న ఒక చెట్టుకొమ్మ రాజు నుదురుకు బలంగా తగిలి రక్తం కారసాగింది. అతను కిందపడిపోయి, కాలినడకన ఒక వాగు వద్దకు వచ్చాడు. ధారాపాతంగా కురిసే వానకు వాగు పొంగసాగింది. రాజుకు ఈత వచ్చును గాని, రక్తం పోవటంవల్ల బలం తరిగిపోయి, అతను ఆ వాగు వెంబడి కొట్టుకుపోతూ, స్పృహ కోల్పోయాడు.

అతనికి తిరిగి స్పృహ వచ్చేసరికి అతని తల కొద్దిగా నొచ్చుతున్నది. అతనొక రాళ్ళతో కట్టిన ఇంట ఉన్నాడు. ఒక చక్కని ఆడపిల్ల సాధారణ దుస్తులు ధరించి, అతని కాళ్ళు ఒత్తుతున్నది.

అతను కళ్ళు తెరవటంచూసి ఆమె తృప్తితో నవ్వి, ''తిరిగి ప్రపంచంలో పడ్డావన్న మాట! నాలుగు రోజులుగా నిన్ను గురించి



చాలా ఆదుర్దా పడ్డాం. మా రేవులో నువ్వు కనిపించినప్పుడు కొనప్రాణంతో ఉన్నావు. నువ్వు ఇప్పుడున్నది సోన్‌పూర్ అరణ్యానికి రాజైన ఫకీరా రాజభవనంలో. నేను రాజ వైద్యుడి కూతురును. నా పేరు మంజరి. నువ్వు పూర్తిగా కోలుకొనటానికి కనీసం ఒక నెల పట్టుతుంది. మా తండ్రి ఇచ్చే మూలికలతో నీ ఆరోగ్యం చక్కబడుతుంది. నీకు కావలసినది చూడటానికి నేను అహర్నిశలు నీ వద్దనే ఉంటాను. నువ్వు ఎవరో మాకు తెలియ లేదు. నువ్వు ఎవరో నీ పేరేమిటో తెలిసినట్టయితే నీ దగ్గిర వాళ్ళకు తెలిపి ఉండే వాళ్ళం,'' అన్నది.

మంజరి తండ్రీ, ఫకీరా వచ్చారు.

''నీ వాలకాన్ని బట్టి మంచి వంశానికి చెందినవాడివని గ్రహించాం. నువ్వు ఎవరో చెబితే నిన్ను మీ ఇంటికి చేర్చుతాం,'' అన్నాడు ఫకీరా.

తన అసలు వివరాలియ్యటం అపాయకరమని శంకించి జయపాలుడు, ''మా తండ్రి విక్రమపూరుకు చెందిన ఒక వర్తకుడు. నేను పనిమీదపోతూ, దారిలో ఉపద్రవానికి గురి అయ్యాను,'' అన్నాడు.

వాళ్ళు అతని మాటలు నమ్మారు. మంజరి రోజు రోజుకూ అతనికి మరింత సన్నిహితురాలవుతున్నది. ఆమె చేసే సేవలకు అతని హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది. ఆమె రుణం ఎలా తీర్చుకోవాలో అతనికి తెలియ లేదు. తాను ఇక్కడినుంచి తప్పించుకుపోవాలంటే తనకు సహాయపడగలది మంజరి ఒకతే. ఆమె అతన్ని గాఢంగా ప్రేమించినట్టు అనేక నిదర్శనాలు కనపడినాయి. అయితే, తాను తప్పించుకు పోయినాక మంజరి అపాయానికి గురి అవుతుంది. మంజరికి అభ్యంతరంలేని పక్షంలో అతను ఆమెను తన వెంట రుద్రపురానికి తీసుకుపోవాలి. తాము వివాహం ఆడటానికి రూపమతి, పరిస్థితులను పాటించి, అభ్యంతరం చెప్పదు.

జయపాలుడు స్వస్థుడయ్యాక మంజరితో, ''నాకు వేరే జీవితం ఉన్నది. ఇక్కడి మీ జీవితంలో ఇమడటం నాకు సాధ్యం కాదు. నేను వెళ్ళిపోవాలి. అందుకు నీ సహాయం కావాలి. నేను వెళ్ళిపోయాక, నింద నీపై మోపుతారు. నీకు ఎలాంటి శిక్షపడుతుందో నాకు తెలియదు,'' అన్నాడు.

''నన్ను చిత్రవధ చేస్తారు. అయితే ఆ శిక్షను నేను చాలా సంతోషంగా అనుభవిస్తాను. నువ్వంటే నాకెంతో ఇష్టం. నువ్వు నీ వాళ్ళతో సుఖంగా ఉండటమే నాకు కావలిసింది,'' అన్నది మంజరి.

''నేను పశువును కాను. నేనూ నిన్ను ఇష్టపడుతున్నాను. నువ్వుకూడా నా వెంట మా దేశానికి రా. నా పెద్దభార్య అనుమతితో, మా ఆచారం ప్రకారం, నేను నిన్ను పెళ్ళాడుతాను. నీకు అభ్యంతరమా, మంజరీ?'' అని జయపాలుడు అడిగాడు.

అందుకు మంజరి సంతోషంగా ఒప్పుకున్నది.



ఒక చీకటి రాత్రి ఇద్దరూ బయలుదేరారు. వాళ్ళు రుద్రపురం చేరినమీదట జయపాలుడు, ''నీతో ఇంతకాలమూ చెప్పనందుకు క్షమించు, మంజరీ, నేనే రుద్రపురానికి రాజును,'' అన్నాడు.

''తెలియకనేనేదైనా అపచారం చేసిఉంటే క్షమించండి,'' అన్నది మంజరి.

రూపమతి అయిష్టంగానే అనుమతించిన మీదట జయపాలుడికీ, మంజరికీ వివాహం జరిగింది.

మంజరి నాగరిక పద్ధతులు ఎరిగినది. రాజభవనంలో ఆమె అందరినీ ఆదరంతో చూసింది. రాజుకొడుకు శక్తిపాలుడు ఆమెకు చాలా మాలిమి అయ్యాడు. ఆమె అతన్ని సొంత కొడుకులాగే చూసుకున్నది. తన స్థాయికన్న రాజభవనంలో మంజరి స్థాయి పెరిగిపోవటం చూసి రూపమతి అసూయతో దహించుకుపోసాగింది. ఒక రోజు ఆమె నిద్ర లేస్తూనే తన ముత్యాలహారం ఎవరో తీశారని ఆందోళన లేవదీసింది. ఆ నేరం ఎలాగైనా మంజరి మీదికి తోయాలని ఆమె ఉద్దేశం.

రాణిగారి హారం పోయిందనగానే కాపలావాళ్ళు కంగారుపడ్డారు. కాని మంజరి, ''నేను దొంగను పట్టేస్తాను. నేను అడవి నుంచి వచ్చినదాన్ని కదా! మాకు అనేక మంత్రశక్తులున్నాయి. దొంగను పట్టుకునే ముందు నా మంత్రశక్తులు ప్రదర్శిస్తాను. అందరూ రాజభవనం చావడిలోకి రావాలి,'' అన్నది.

ఆరోజు మధ్యాన్నం తన భర్తతో ఆమె పథకం ఒకటి చెప్పింది. అపరాహ్ణం చావడి జనంతో నిండిపోయింది. కళ్ళకు గంతలు కట్టుకుని మంజరి అక్కడికి వచ్చింది. రాజు

ముందు పెద్ద బల్లమీద అనేక వస్తువులు చిన్నవీ, పెద్దవీ పాతిక దాకా ఉంచబడ్డాయి. మంజరి కోరిన ప్రకారం రాజకుటుంబానికి చెందిన వారు ఒక్కొక్కరే వచ్చి ఒక్కొక్క వస్తువును తాకారు. ఒక వస్తువును ఎవరైనా తాకినప్పుడు రాజు, ''మంజరీ, తాకిన వస్తువు ఏది? కోడిగుడ్డా, గొడుగా, లోటా?'' అని అడిగాడు.

''లోటా,'' అన్నది మంజరి, అది నిజమే. మరొకసారి, ''మంజరీ, తాకిన వస్తువు ఏది? విసనకర్రా, సంచీయా, లోటా, కోడిగుడ్డా, సిరాబుడ్డియా, కొవ్వొత్తా, ఈకా...?'' అని అడిగాడు.

''కొవ్వొత్తి!'' అన్నది మంజరి, అదీనిజమే.

ఈ విధంగా మంజరి ప్రతిసారీ నిజం చెప్పింది. అందరూ ఆమె శక్తిచూసి ఆశ్చర్య పడ్డారు.

''రేపు సాయంకాలం లోపల పోయిన హారం దొరక్కపోతే దొంగను పట్టేస్తాను. ఇంత కన్న బలమైన శక్తులు నాకున్నాయి,'' అన్నది మంజరి.

ఆ సాయంకాలం రూపమతి మంజరి వద్దకు రహస్యంగా వెళ్ళి, ''మన భర్త మీద ప్రమాణంచేసి రహస్యం దాస్తానంటే నీకో మాట చెప్పాలి,'' అన్నది. ''అలాగే ప్రమాణం చేస్తాను. చెప్పు,'' అన్నది మంజరి.

''నన్ను క్షమించు, సోదరీ. నేనే దొంగను. అసూయకొద్దీ నీ మీద దొంగతనం మోపాలని చూశాను. నా తప్పు తెలిసివచ్చింది. నీలాటి దొడ్డబుద్ధిగల మనిషి మీద అసూయపడటం అవివేకం,'' అన్నది రూపమతి. ఇద్దరూ కౌగిలించుకుని ఆనందబాష్పాలు రాల్చారు.

మంజరి చేసిన ఇంద్రజాలానికి ఆధారం ఏమిటి? ఎవరన్నా ఒక వస్తువు తాకినప్పుడు రాజు వస్తువులను పేర్కొంటూ అసలు వస్తువు పేరు చెప్పే ముందు ఒక నల్లని వస్తువును చెప్పేటట్టు ముందుగా ఏర్పాటు జరిగింది. ఆ ప్రకారం రాజు లోటాకు ముందు గొడుగు పేరూ, కొవ్వొత్తికి ముందు సిరాబుడ్డి పేరూ చెప్పాడు.

తన ముత్యాలహారం దొరికినట్టు రూపమతి ప్రకటించింది.




చిత్రాలు: గాంధి అయ్య
15
అజేయుడు గరుడుడు!
ఈశాన్య దిశలోని శిథిలాలయాన్ని వెతుక్కుంటూ బయలుదేరిన ఆదిత్యుడు, మార్గమధ్యంలో వజ్రపురి రాజు ఆతిథ్యం పొందాడు. ఆ రాత్రి విడిదిభవనం పేలిపోయింది. ఆదిత్యుణ్ణి గరుడుడు సురక్షితంగా ఆలయ ప్రాంతానికి చేర్చి, దాని చరిత్ర తెలియజేశాడు.


ఆదిత్యుడు ఆలయంలోకి వెళ్ళి పరిశీలనగా చూశాడు.
భగవంతుడి దయవల్ల దేవాలయం అంతగా నాశనం కాలేదు!


మొదట ఈ రాయిరప్పలను తొలగించాలి. అప్పుడే భక్తులు ఇబ్బంది లేకుండా నడవగలరు.


చంద్రపురి నుంచి వచ్చిన భటులు, రాళ్ళను తొలగించడానికి పూనుకున్నారు.
యువరాజా, ఈ పనిని మేము చేయగలం. ఎలా చేయాలో తమరు చెబితే చాలు.


ఇదో అద్భుతం! భగవంతుడే దీన్ని పరిరక్షించాడు.


ఆదిత్యుడు ఆలయం లోపలికి ప్రవేశించాడు.
ఏమిటీ వింత! విష్ణువిగ్రహం గర్భగ్రుహానికి వెలుపల ఉన్నదేమిటి?


ఆదిత్యుడు వెలుపలికి వచ్చాడు
మీలో ఇద్దరు వెళ్ళి, సమీపంలో ఏదైనా గ్రామం ఉన్నదేమో చూసి పనిముట్లు పట్టుకురండి.


హఠాత్తుగా ఆదిత్యుడికి ఓంకారనాదం వినిపించింది.
ఓంకారాన్ని జపిస్తున్న వారెవరు?


చిన్న గుడి నుంచి ఆ శబ్దం వినిపిస్తున్నది.
గరుడుడి విగ్రహం! దుమ్ముపట్టి ఉన్నది.


ఆదిత్యుడు తన శాలువాతో, విగ్రహం మీది దుమ్ము దులిపి శుభ్రం చేశాడు.


ఆదిత్యుడికి ధ్యానం చేయాలనిపించి, అలాగే కూర్చున్నాడు.


అక్కడ గుహాలయాల్లోకి భూతవైద్యుడు అడుగుపెట్టాడు.
అయ్యా, విశేషాలేమిటో చెబుతారా?


మీ తండ్రిగారెక్కడ? ఇవాళ ఎనిమిదవ పున్నమి రేయి కదా!


...మేము మా గురువుల కంఠస్వరం విన్నాం.
మా గురుదేవులు, "నా ఆత్మ నరేంద్రదేవుణ్ణి ఆవహిస్తుంది. ఆయనే మీ నూతన యజమాని," అని చెప్పారు.


అంటే, మా తండ్రికి మళ్ళీ కాళ్ళు చేతులు వస్తాయంటావా?
అందులో సందేహం ఎందుకు రవీంద్రా?


అంతలో ఒక కోయయువకుడు లోపలికి వచ్చి వజ్రపురి ప్రధాన మంత్రి వచ్చినట్టు తెలియజేశాడు.


నేను వెళ్ళి వెంటబెట్టుకుని వస్తాను, నాన్నా!


స్వాగతం! సుస్వాగతం!!
మిత్రమా, మీ తండ్రి రక్షణ కోసం, మా రాజుగారు కొందరు భటులను పంపారు.


అవును, అతని తండ్రికి ఇప్పుడు ప్రత్యేక రక్షణ కావాలి.
అలాగా? నేను మీకో వార్త తెచ్చాను...


యువరాజు ఆదిత్యుడు వజ్రపురికి వచ్చాడు. అతడు విశ్రాంతి తీసుకుంటున్న విడిదిభవనం పేలిపోయింది...


ఆకాశంలో మనిషి ఎగిరి వెళ్ళడం చూసినట్టు కొందరు చెబుతున్నారు!
అందులో సందేహం లేదు. అది మన గురువుగారి పనే! అదిగో, మీ తండ్రిని చూడు.


నరేంద్రదేవుడి తల చుట్టూ కాంతివలయం కనిపించింది.
మీరు చెబుతున్నది నిజంకాదు!
ఆయన మన గురువుగారి కంఠస్వరంతో మాట్లాడుతున్నాడు.


ఆదిత్యుడు సజీవుడుగానే ఉన్నాడు! అతన్ని హతమార్చాలి! అతన్ని బలి ఇవ్వాలి!


ఉన్నట్టుండి వాళ్ళకు గుహలో పాములు కనిపించాయి.
ఆయన మా తండ్రిగారా? లేక వేరొక నాగబంధువా?

అంటే మా ప్రజలు చెప్పింది అబద్ధం కాదు. అలా ఎగిరి వెళ్ళిన వ్యక్తి ఆదిత్యుడే అయి ఉండాలి. అయితే, అతన్ని కాపాడిన ఆ గరుడుడు ఎవరు?

ఉన్నట్టుండి నరేంద్రదేవుడి తల చుట్టూ ఉన్న కాంతివలయం మాయమయింది.

చూశారా! మా తండ్రికి మళ్ళీ ఆయన కాళ్ళూ, చేయీ వచ్చాయి. నా కళ్ళను నేనే నమ్మలేకుండా ఉన్నాను.

అవును. రవీంద్రా! నేను నాగబంధు ఆత్మను! ఆయన ఇప్పుడు నా ద్వారా మీతో మాట్లాడగలడు!

అయ్యా, నేను వెంటనే తిరిగి వెళ్ళి మా రాజుగారికి ఈ శుభవార్త తెలియజేయాలి. చంద్రపురి మీద దండెత్తడానికి ఆయనకిప్పుడు మరింత విశ్వాసం కలుగుతుంది. సెలవు తీసుకుంటాను.

నా సహాయ సహకారాలు మీకు ఎప్పుడూ ఉంటాయని మీ రాజుకు చెప్పు!

నాన్నా, నేను వెళ్ళి మంత్రిని సాగనంపి వస్తాను.

వాళ్ళు గుహ వెలుపలికి వెళ్ళాక....

మనం ఇప్పుడు మరిన్ని అద్భుతాలను ఎదురుచూడవచ్చు.

మేము చంద్రపురి మీదికి వెంటనే దాడి చేయడానికి ఆలోచిస్తున్నాం.

ఎప్పటికప్పుడు మీ నుంచి విశేషాల కోసం ఎదురుచూస్తూ ఉంటాను.

-(ఇంకావుంది)

# విషు పండుగ



కేరళ ప్రాంత మంతటా విషు పండుగను జరుపుకుంటారు. మామూలుగా ఏప్రిల్ 14వ తేదీన వచ్చే మలయాళం తొలిమాసం మేడమ్ ఆరంభాన్ని సూచించే నూతనసంవత్సరాది పండుగ ఇది. ప్రకృతి మాత ప్రసాదించే వనరుల మీదే మన సంపదలు ఆధారపడివున్నాయన్న సత్యాన్ని ఈ పండుగ జ్ఞాపకం చేస్తుంది.

పండుగకు ముందు రాత్రి పెద్దలు అమర్చే 'విషుక్కని' ద్వారా ఇది ప్రకటితమవుతుంది. సంప్రదాయంగా వస్తున్న రెండు దీపస్తంభాల మధ్య పెద్ద కంచు పాత్రను ఉంచుతారు. పాత్రలో బియ్యం పోస్తారు. బియ్యం మీద అరిటాకుల దొన్నెలలో నవధాన్యాలు ఉంచుతారు. దొన్నెల మధ్య కొత్తబట్టను విసనకర్రలా మడిచి అమర్చుతారు. దానిపై ఒక చోట బంగారు నగను, వెండి నాణాలను, ఇత్తడి చట్రంగల అద్దాన్నీ పసుపు పచ్చని పువ్వులనూ అమర్చుతారు. పాత్రలో తాజా ఫలాలను, కూరగాయలను కూడా ఉంచుతారు. అందులో కృష్ణుడు, లక్ష్మి,సరస్వతి చిత్రాలను కూడా ఉంచుతారు.

మరునాడు తెల్లవారు జామున ఆ ఇంటిలోని పెద్ద, చిన్న వారిని ఒక్కొక్కరిగా నిద్రలేపి వెంటబెట్టుకుని విషుక్కని వద్దకు తీసుకువెళతారు. వాళ్ళు విషుక్కని వద్దకు చేరాక కళ్ళు తెరిచి, అక్కడున్న అద్దంలో తమ ముఖాలను చూసుకుంటారు. దీనిని శుభప్రదమైన 'కని-కానుక'గా చెబుతారు. దీపకాంతుల మధ్య అమర్చిన ప్రకృతి ప్రసాదించిన ఫలపుష్పాలు, ధాన్యాలు కనులవిందు చేస్తాయి. ఆ తరవాత చిన్నవారు ఇంటి పెద్ద నుంచి 'విషుక్కైనీట్టం'' అనే నాణెం కానుకను ఆనందంగా పుచ్చుకుంటారు. ఆ తరవాత అందరూ వాకిట్లోకి వచ్చి బాణాసంచా పేలుస్తారు. మధ్యాహ్నం చేసే పిండివంటల విందు భోజనం పండుగలో ప్రధాన భాగంగా ఉంటోంది.



పెన్నా సిమెంట్ వారి
పెన్నా గోల్డ్
Portland Pozzolona Cement



PENNA CEMENT INDUSTRIES LTD.
Plot No. 703, Sriniketan Colony, Road No.3, Banjara Hills, Hyderabad-500 034, (A.P.)
www.pennacements.com, Email : marketing@pennacements.com
Phones : 23353950, 23353952
Fax : 040-23353951

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....



## విజ్ఞాన వీచికలు :

### సున్నా కథ

మనకందరికీ సున్నా తెలుసు. ఇది ఒకటికన్నా ముందు వస్తుంది. ఈ సున్నాను కనుగొనడం గణితశాస్త్రం మొత్తం మీద విప్లవాత్మకమైన మార్పులు తీసుకువచ్చింది. సున్నా అనే భావన బాబిలోనియాన్‌లాంటి పలు పురాతన నాగరికతలలో కనిపించినప్పటికీ, మనం ఇవాళ ఉప యోగిస్తున్న చిహ్నం ఆ తరవాతి కాలం వరకు కనుగొనబడలేదు.

మధ్య ఆసియా-భారత దేశాల మధ్య వెలసిన వర్తకవాణిజ్య సంబం ధాలు మన దేశానికి 'సున్నా'ను పరిచయం చేశాయని కొందరు నిపుణులు భావిస్తున్నారు. మాయాన్లు, బాబిలోనియన్లలాగే భారతీయులు కూడా ఖాళీ స్థలాన్ని చూపడానికి '0' గుర్తును ఉపయోగించేవారు. అయినా క్రీ.శ. 9వ శతాబ్దంనాటికి భారతీయులు 'సున్నా'ను ఒక అంకెగా కూడా భావించడం ప్రారంభించారు. దీన్ని గణిత శాస్త్రంలో అతి పెద్ద ముందడుగుగా భావిస్తున్నారు. ఒకటి కన్నా తక్కువ అంకె ఉందనీ ఒకటి నుంచి దాన్ని తీసివేస్తే సమాధానం లభిస్తుందనీ భారతీయులు కనుగొన్నారు. అప్పటి నుంచి భారతీయ సంఖ్యావిధానం మనం ఇవాళ అంకెలను గణిస్తున్నట్టు 10 మీద ఆధారపడి ఉంటున్నది.

## మన పరిసరాలు

### కొత్త పక్షిజాతి



ఇటీవల ట్రినిటీ కాలేజ్‌పరిశోధకులు ఆగ్నేయ సులవేసియా లోని ట్రినిటీ గ్రామంలో వాంగీ వాంగీ లేదా 'వైట్-ఐ' అనే కొత్త పక్షిజాతి పిట్టను కనుగొన్నారు. వాంగీ వాంగీ దీవి నుంచి ఈ బుల్లి పిట్టలను తరిమివేయడం వల్ల, ప్రత్యేకమైన దీవిజాతి పక్షులుగా ఇవి రూపొందాయని భావిస్తున్నారు.

వీటిలో పాలిపోయిన కడుపు భాగంగల వైట్-ఐ కొత్త ఉపజాతి పక్షి అని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. నిమ్మ రంగు కడుపుభాగం గల పక్షులతో కలిసి ఉండగా మొదట ఈ పక్షులను కనుగొన్నారు. కొన్ని నిర్దిష్టమైన తేడాలు ఉన్నప్పటికీ ఇవి పాలిపోయిన కడుపు భాగంగల 'వైట్-ఐ'ని పోలి ఉన్నాయని చెబుతున్నారు.

వాంగీ వాంగీ వైట్-ఐ కీటకాలు తిని జీవించే, పాటలుపాడే పక్షుల జాతికి చెందిన చిన్నపిట్ట అని పక్షిశాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## మీకు తెలుసా?



### సుప్రసిద్ధ హాస్యం

కొట్టడం, గుద్దుకోవడం, జారి పడడం మొదలైన దృశ్యాల ద్వారా హాస్యాన్ని పంచడం నాటకాలలో చాలా కాలంగా ఉంటోంది. ఇలాంటి స్లాప్ స్టిక్ కామెడీలలో తేలిక పాటి హింస ఉన్నప్పటికీ దాన్ని ఎవరూ హింసగా భావించరు. చూసి నవ్వు కుంటారు. ఉదాహరణకు విదూషకుణ్ణి కొడితే ముక్కు ఊడి కిందపడిపోతుంది! దాన్ని చూసి ప్రేక్షకులు నవ్వుకుంటారు.

హాస్య దృశ్యాలను మరింత పండించడానికి మద్దెల ధ్వని, తాళం వేయడంలాంటి శబ్దాలను ఉపయోగిస్తారు. జారి దభీమని కింద పడితే తాళం వాయిస్తారు. పదహారవ శతాబ్దంలో ఇటలీలో ప్రదర్శించిన హాస్య నాటకాలలో కొందరు నటులు చేతులతో వంగే దుడ్డుకర్రలను పట్టుకునేవారు. స్లాప్ స్టిక్స్ అనే వీటితో కొట్టినట్టయితే ఫెళ్ళుమనే శబ్దాలు వినిపించేవి. అందువల్లనే అలాంటి హాస్యానికి 'స్లాప్‌స్టిక్ కామెడీ' అనే పేరు వచ్చింది.

## మన దేశం క్విజ్

మన దేశంలో రాష్ట్రపతి అబ్దుల్ కలామ్ పదవీ కాలం పూర్తి కావడంవల్ల త్వరలో నూతన రాష్ట్రపతి ఎన్నికలు జరుగనున్నాయి. ఈ సందర్భంగా మన మాజీ రాష్ట్రపతుల గురించి మనకెంతవరకు జ్ఞాపకం ఉందో ఈ క్విజ్‌లో చూద్దాం.



1. ఆయన పిల్లల కోసం కథలు రాసేవారు. వాటిని తన సొంత మనవలు, మనవరాండ్ర పేర రాసేవారు. ఆయన ఎవరు?
2. ఇప్పుడు మనమధ్య ఉంటూన్న ఏకైక మాజీ భారత రాష్ట్రపతి ఎవరు?
3. ఆయన ఇంగ్లాండులో చదివారు. ఆ తరవాత ఆ మాతృ సంస్థలో ఉపన్యాసాలు ఇవ్వడానికి ఆహ్వానించ బడ్డారు. ఆయన ఎవరు?
4. రెండు సార్లు వరసగా రాష్ట్రపతి పదవిని అలంకరించిన వారెవరు?
5. యువ ప్రాయంలో ఆయన సుప్రసిద్ధ కార్మిక యూనియన్ నాయకుడు. ఆయన పేరేమిటి?

(సమాధానాలు 66వ పేజీలో)

చందమామ
ఇండియా క్విజ్ - 1
(ఫిబ్రవరి '07)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు. అందువల్ల బహుమతి ఇవ్వలేక పోతున్నాం. క్విజ్-1 సమాధానాలు 35వ పేజీలో ఇవ్వబడ్డాయి.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



NARAYANAMURTHY TATA



NARAYANAMURTHY TATA

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జూన్ 2007 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్‌ఆఫీసర్స్‌కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 032.

## అభినందనలు

ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు
వేముగంటి జతిన్ రాజ్
తం.పే. వి.కె. ప్రసాద్
ఫ్లాట్ నం. 302, సామా అపార్ట్‌మెంట్స్
మూసారం బాగ్, మలక్‌పేట
హైదరాబాద్ (ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : ఆటల్లో ఆనందం!
రెండవ ఫోటో : అలసినా ఆహ్లాదమే!!

## సమాధానాలు :

1. డా. జాకీర్ హుస్సేన్ (1967-69)
2. ఆర్. వెంకటరామన్ (1987-92)
3. డా. ఎస్. రాధాకృష్ణన్ (1962-67)
4. డా. రాజేంద్రప్రసాద్ (1950-1962)
5. వి.వి. గిరి (1969-1974)

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 032. Editor : B. Viswanatha Reddi (Viswam)